# కుంతల

(సాంఘిక నవల)

చలసాని వసుమతి

ఆదర్శ గ్రంథ మండలి
విజయవాడ-2

ఆదర్శ ప్రచురణ :

ప్రథమ ముద్రణ

డిశంబరు, 196౫.

వెల : రు. 2-50

ముద్రణ :

శ్రీ గాయత్రీ ప్రెస్,

విజయవాడ-౨.

1

"చిన్నారి చిరుగంతుల చిన్నారి,
వివేక, విజ్ఞాన, విద్యావిజేతగా
మారి, అందరినీ సంతోషపెట్టే
ముద్దులతమ్ముడు—

"కలవారి ఆడబడుచు, నిరా
డంబరత, సౌమ్యతాగంధాన్ని
వెంట తెచ్చుకొని, సుఖాన్ని
పంచబోయే చిన్నారిమరదలు—"

స త్య వ తీ మ ల్లి ఖా ర్జు ను ల కు

ఈ "కుంతలాకుసుమం" ఆశీర్వదిస్తూ

అంకితం

౭

## గమనిక

ఈ నవలయందుగల పాత్రలు ఎవరికీ చెందినవి కావు. సంగీతంలా, సాహిత్యం అందరినీ తన్మయపరచి నపుడే సార్థకం చెందుతుందని నా ఉద్దేశ్యం.

—రచయిత్రి.

3

# పరిచయము

"కుంతల" శ్రీమతి వసుమతీదేవి మొదటి నవల.

మొదటినవల అనగానే కొండంత ఉత్సాహము కలిగినా నలుసంతైనా సందేహం రాకమానదు. వాసనచూడనట్టి ప్రసవములోనూ సానచివిన్యాసమెరుగని రత్నంలోనూ ఉండేనవ్యతను మనము మొదటినవలలో చూడగలమనే ఆశ ఉత్సాహాన్ని కలిగిస్తుంది. కాని, ఆ ఉత్సాహాన్ని రవంత వెనుకకులాగే సందేహము రచయిత్రి రచనానైపుణ్యాన్ని గురించి. ఏపనిఅయినా అనుభవముమీదటనే రాణిస్తుంది కదా, వీరికి అనుభవము తక్కువ అనేకారణంగా సాహిత్య రీత్యా ఈ రచన ఉత్తమస్థాయి నందుకోలేదేమో అనేభీతి రాకమానదు. కాని, ప్రస్తుత రచనను కొంత సానుభూతితో చదివే చదువరీ విమర్శకుడూ కూడా కొన్ని పుటలు చదివే లోపుగానే అటువంటి భీతికి కారణము లేదని తెలుసుకుంటారు. ఆ తరువాత ఉత్సాహమే వారిని క్రమ్మివేస్తుంది.

ఆ మధ్య 'బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్' సంస్థవారు కొందరు ప్రఖ్యాత రచయితలను 'నేను ఎందుకు రచిస్తున్నాను?' అనే ప్రశ్నకు సమాధానం చెప్పతూ ప్రసంగించమన్నారు. వారిలో ఒకరి ప్రసంగానికి చివరి మాటల అర్థం ఇలా ఉన్నది : "నేను ఎందుకు రచిస్తాను ? చదువరి కోసం కాదు – నా కోసము, నా ఆత్మసంతోషంకోసము రచించుకుంటాను – నా రచన నానాటికీ మరింత రమ్యంగా అతిశయిల్లాలని ఆశిస్తూ, ప్రతిసారీ, అనుకొన్న అంతస్తును అందుకోలేకపోతూ . . . నా రచనను ఎవ్వరూ చదువడములేదు అని తెలియవచ్చినా నేను రచిస్తానా? రచింపనేమో! కాని, అప్పటికీ నా మెదడులో రచన సాగుతూనే ఉంటుంది, ఆ వ్యాపకము నేను ఆపలేను" – అని.

శ్రీమతి వసుమతీదేవిన్ని ఈ కోవకు చెందిన రచయిత్రి అని నా విశ్వాసము.

"సమకాలిక ప్రజాజీవనానికి అద్దమువంటిది నవల"—అని ఒక నిర్వచన. ఆ దృష్టితో చూస్తే "కుంతల" నేటిమన సాంఘిక పరిస్థితులను చక్కగా ప్రతిబింబిస్తుంది అనవచ్చును. ఈ ప్రతిబింబించడములో కొందరు వ్యక్తుల విచిత్రప్రవర్తన ప్రస్ఫుటమవుతుంది. ఆ ప్రవర్తన లోకకళ్యాణానికి విరుద్ధంగా ఉన్నపుడు మన ఈరచనద్వారా అటువంటి విచిత్రప్రవర్తనను మాన్పగలమా? అనేప్రశ్నను గురించి వేరువేరు అభిప్రాయాలకు ఎంతైనా అవకాశమున్నది.

ప్రఖ్యాత కళావిమర్శకుడు ఆస్కార్‌వైల్డు ఒక సందర్భంలో కళను గురించి అనినమాట సాహిత్యానికి వర్తిస్తుందేమో. ALL ART IS USELESS కళ పూర్తిగా నిష్ప్రయోజనమే అని. ఈమాట కొంత విభ్రాంతిని కలిగింపవచ్చును. కాని, ఆ నిర్వచన అంతరార్థమేమిటంటే ఉత్తమ కళాకారుడు ఒకానొక స్పష్టమైన ప్రయోజనము నిమిత్తము కళారూపాలను సృష్టించడు అని. అతడు చేసేకృషి పూర్తిగా ఆత్మవికాసము కోసమూ ఆత్మ సంతృప్తి కోసమూను. ఆ కృషిలో నిజమైన విలువ ఉంటే సహృదయులకున్నూ ఆత్మవికాసము కలుగుతుంది. నేననుకోవడము సాహిత్యరంగములోనూ ఈ అభిప్రాయం వర్తిస్తుందని. ఈ నవలా రచన పూర్తిగా ఆత్మ వికాసము కోసమే ఆత్మసంతృప్తికోసమే సాగినదనుకోవడము నాకు ఇష్టము. నవలను ఆసక్తితో చదువగా చదువగా మనకున్నూ ఎంతో కొంత ఆత్మవికాసము కలిగితే ఈరచనకు మరింత ధన్యత చేకూరుతుంది. ఇప్పటి నీరసపరిస్థితులలో ఇంతటి ఆసక్తిపూరితమైన రచన— అదీ మొదటి నవలగా—అవతరించడము మిక్కిలి ముదావహము.

—అచంట జానకిరామ్.

# నాలుగు ముక్కలు

ఈ నవల వ్రాసిన ఆమె హృదయానికీ, నా హృదయానికి బాంధవ్యం. ఆ బంధుత్వాన్ని పురస్కరించుకొని ఏవో నాలుగుముక్కలు హృదయంలోని స్నేహ మాధుర్యంతో రంగరించి వ్రాయమంది. "సరే" అని తలవొగ్గాను ఆ ప్రేమ శాసనానికి.

ఈ నవలలోని అనేక పాత్రలు వాస్తవజీవితంలోని వ్యక్తులకు ప్రతిబింబాలు. అలా అని ఇది వాస్తవానికి కేవలం అనుకరణా అంటే అదీకాదు. వాస్తవానికి కల్పన జతగూడింది. కళాసృష్టిచేసే సందర్భంలో కేవలం సృష్టిని అనుకరించడం ఆరంభిస్తే అది కళే అనిపించుకోదు. కేవలం సృష్టి అనుకరణ కళ యొక్కధర్మంకాదు. కళాసృష్టి నిర్మాణక్రమంలో రసస్రష్ట తాను అనుభవించిన దానికి ప్రతిభా సమన్వితమైన నవ్యనూతనమైన ఒకవ్యాఖ్యానం ఇవ్వటం అవసరం అవుతుంది. వాస్తవిక విషయ పరిజ్ఞానం, కాల్పనిక ప్రతిభావిశేషం—ఈ రెంటినీ సౌందర్య పరిపూర్ణంగా మేళవించటమే కళ. ఈ నవలలో వాస్తవిక విషయాల క్రోడీకరణేకాక రచయిత్రి తానివ్వదలచుకొన్న వ్యాఖ్యానాన్ని కూడా అంతస్సూత్రంగా ఇమిడ్చి రచన సాగించింది.

ఈ నవలలోని పాత్రలనేకం రచయిత్రి జీవిత చరిత్ర పుటలలో మసలుతూన్న వ్యక్తులే. ఇక్కడ మరొక్క విషయం ఉంది. వాస్తవికస్పర్శ లేని కల్పనఅంటూ లేనే లేదు. చివరకు ఉత్ప్రేక్షా లంకారంలోకూడా వాస్తవిక గంధం అంతో ఇంతో ఉంటుంది. 'కుంతల' లోని కొన్నిపాత్రలు వాస్తవికజీవితంలోని పాత్రలే అయినా క్రొత్తరూపాలను, క్రొత్త క్రొత్తలక్షణాలను సంత

రించుకొని మనకు దర్శనం ఇస్తాయి. ఇక్కడనే రచయిత్రి వైచిత్రి రచనారంగంలో చిత్రీకరింపబడుతుంది. అంటే తను అనుభవించిన విషయాలకు రచనారూపం ఇచ్చి విశ్వజనీనం సార్వకాలికం చేసేందుకు ఈ ప్రక్రియ అవసరం అవుతుంది. అలా రచయిత చేతులలో వాస్తవికవ్యక్తులు కొన్నిలక్షణాలు పోగొట్టుకొని, కొన్ని క్రొత్తలక్షణాలు రాబట్టుకొని వినూత్న గతిలో మలచబడతారు. అలాగే ఈ నవలలోను మలచబడి పాత్రలు సజీవంగా కళ్ళముందు మెదులుతాయి.

"కుంతల" లోని పాత్రలను గురించి పేరుపేరునా ఇక్కడ చర్చించవూనుకోటంలేదు. ఈ నవలలో కొన్నిపాత్రలు రూపాయిలకన్నా హృదయాలకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తాయి. మరి కొన్ని పాత్రలు రూపాయిలతోనే మనుష్యుల విలువలను కట్టి జీవితాలతో చెలగాటాలాడుకొంటాయి. ప్రేమభావంతో స్నిగ్ధహృదయంతో సర్వార్పణంచేసికొనే వ్యక్తులూఉన్నారు. ప్రేమ సటించి, ప్రేమకన్నా వాళ్ళకు విలువైన రూపాయిల సంగతి వచ్చేటప్పటికి సన్నిహితమైన వ్యక్తులనే అగాధంలోనికి త్రోసేసి దూరతీరాలలో అదృశ్యమైపోయేవ్యక్తులూ ఇందులో కన్పిస్తారు. 'కుంతల' చదవడం ప్రారంభించండి. ఎవరు ఎవరో పోల్చుకోండి. నాలుగుపేరాలుగా రూపొందిన నా హృదయంలో స్పందించిన నాలుగుముక్కలూ ఇవే.

విశ్వావసు
కార్తీక పూర్ణిమ
"మానస విజ్ఞానమందిరం"
హైదరాబాద్.

శ్రీధర్ బాబు.

# కుంతల

పచ్చటిపొలాలపై మంచుతెరల నీడలలోనుండి, తొంగిచూచే ఉషోదయం గమనించేభాగ్యం పట్టణాలలో లేదనే సత్యాన్ని నిరూపిస్తూ, ఎవరికివారే కొంపలుమునిగి పోయేట్లు పరుగిడుతున్నారు. మహానగరవీధులలో, అల్పహృదయునికోరికల్లా తారురోడ్డుపై భాగ్యవంతులవాహనాలు జారి పోతున్నాయి చిందులేస్తూ.

హాస్పిటల్ పాలరాయి సూర్యోదయకిరణాలను అలంకరించుకొని సోయగాలను చిమ్ముతోంది. "కుంతల" డిస్పెన్సరీ దగ్గర కారుఆపిన డాక్టర్ సునీతను చూస్తూనే డాక్టర్ మల్లిక్, డాక్టర్ సమత ఆనందంతో ఆహ్వానించారు.

"ఏమిటో సమతా ! అలవాటయిపోయింది. ఇక్కడకు రాకుండా హాస్పిటల్‌కు వెళ్ళినా మనసిక్కడే ఉండిపోతుంది." హాలులో ఎన్‌లార్జి చేయబడిన కుంతలఫొటోకు చేసిన అలంకరణను చూస్తూ పరధ్యానంగా అంది సునీత.

"మనస్సిక్కడే ఉంటే పేషెంట్లు అక్కడ శరీరాన్ని వదలి పారిపోతారు. సునీతా, జాగ్రత్త!" నవ్వుతూ అన్నాడు మల్లిక్.

"అక్క ఆశీర్వాదముంటే మనకు ఈ జీవితంలో ఆ లోపమెప్పుడూ ఉండదన్నా! అదీగాక నీ ప్రేమకు పాత్రుల

మయినందున సమత, నేనూ అదృష్టవంతులం". మెరిసే కళ్ళతో మల్లిక్‌ను చూస్తూ అంది సునీత.

నిష్కపటము, నిరాడంబరత, ఇట్టే ఆకర్షించే చిరునవ్వు, సజ్జనశీలిఅయిన మల్లిక్ ఎన్ని జన్మలకైనా అన్నగానే వుండా లని మరొకసారి ప్రార్థించుకుంది సునీత. అక్కలాగానే తననూ ప్రేమిస్తూ, తన సలహాలనుతీసుకుంటూ నిర్మలస్వభా వంతో ప్రేమించే సమత, మల్లిక్‌లు తనను కోరి యిక్కడ జనరల్ హాస్పిటల్‌కు ట్రాన్స్‌ఫర్ చేయించారు. తనకు అన్న చెల్లి లేని లోటును తీరుస్తూ స్నేహామృతంలో ప్రేమాప్యాయ తలను రంగరించి తనజీవితానికి నూతనోత్సాహాన్నిస్తున్నారు. "కుంతల" అనే బంగారుఅక్షరాలు మరొకసారి తృప్తితీర చదువుకొని, భక్తి, ప్రేమ కలసిన గౌరవంతో, అక్కవైపు చూస్తూ తృప్తిగా అంజలిసమర్పించుకొని వాచీ చూస్తూ, సునీత

"టైమ్ అయిపోయింది అన్నా! సమతా! సాయంత్రం ప్రోగ్రామ్ మరచిపోకు, అన్నను ఏడ్పించకు, మరి వస్తాను—" అంది.

కారు స్టార్టుచేసి నవ్వుకుంటూ వెళ్ళే సునీతను చూస్తూ డాక్టర్ మల్లిక్, డాక్టర్ సమత వెనుదిరిగి నవ్వుతూ పలుక రించే అక్కకు ప్రేమగా నమస్సు లందించారు.

డాక్టర్ సునీత వస్తోందని గమనించిన వార్డు నర్సెస్, తోటి డాక్టర్స్ విష్ చేయసాగారు.

సుగుణశీలసంపత్తితో, ఉదారత, సహనం చూపించే డాక్టర్ సునీత అందరికీ ప్రేమపాత్రురాలయింది.

సునీత చిరునవ్వుతో ప్రతిగా విష్ చేసి నర్సు అందించిన స్టెతస్కోపు తీసుకొని వార్డుకు వెళ్ళి ప్రేమతో తన పేషెంట్లను పలుకరించసాగింది.

"డాక్టర్ ! డాక్టర్ ! సీరియస్ కేస్" హడావిడిగా పిలిచింది నర్స్.

"ఓ. కె." అంటూ అనుసరించింది నర్సును సునీత. బెడ్డుపైవున్న పేషెంటును చూసి షాక్ తిన్నట్లయింది. ఒక్కసారిగా ఎనిమిదిసంవత్సరాలతరువాత మొదటిసారిగా గుండె దడదడకొట్టుకుంది. స్తబ్దంగా ఊపిరిబిగపట్టి తన బాధ్యతను స్మృతికి తెచ్చుకుంటూ అటూ ఇటూ సూక్ష్మంగా పరికిస్తూ అక్కడే నిలబడి తనవైపు ఆశ్చర్యంగా చూస్తున్న నర్సుతో తడబడుతూ,

"కుంతలా డిస్పెన్సరీకి ఫోనుచేసి సమత, మల్లికలను వెంటనే రమ్మన్నానని చెప్పు" అని ఆజ్ఞాపించి చిరుచెమటలను జేబురుమాలుతో అద్దుకుంటూ, స్మృతిహీనమైన పేషెంటును పరిశీలించసాగింది. ఎంతమార్పు ? ఆ ఆకర్షించే సుందరమైన ముఖమేది ? మధువును గ్రుమ్మరించే ఆ అధరాలేవి ? పాలిపోయి, గడ్డంపెరిగి మాసినదుస్తులతో వున్న ఈ పరిస్థితేమిటి ? లక్షాధికారి ! ఏమిటిలా ? గబగబ పరీక్షచేసిన సునీత ఆలోచనలు ఆగిపోయాయి. అందమైన కనుబొమ్మలు విషాదంతో ముడుచుకున్నాయి. రక్తనాళాలు తెగిపోయాయని గమనించింది సునీత. వాంతిచేసుకున్న రఘునోటినుండి రక్తం ఇంకా కారుతూనేఉంది. మురికిగా ఉన్న షర్టును గడ్డకట్టిన నల్లటిరక్తం ఇంకా భయంకరంచేసింది. స్మృతిరావటానికి ఇంజక్షన్ చేసి

పరీక్షగాచూస్తూ నిలబడింది, గతస్మృతుల తాకిడితో బాధ పడుతూ సునీత.

ఆ ! కలువరిస్తున్నాడు ! ఉలిక్కిపడింది. "అవును ! పొర పడ్డాను శ్రీదేవీ ! పొరపడ్డాను. అనురాగం, ప్రేమ, ఆప్యాయత వీటి అర్థాలనుమాత్రమే తెలుసుకొని అనుభవాన్ని విసరి వేశాను. అవును, విసరివేశాను కుంతలా ! విసరివేశాను."

తృళ్ళిపడింది సునీత. "ఏమిటిది? అక్క గుర్తుందన్న మాట! పశ్చాత్తాపమా ! అయితే ఈ జన్మలోనే శిక్షకూడ ఉంటుంది అన్న నగ్నసత్యం అర్థమయింది." చెమర్చినకళ్ళు వత్తుకుంది సునీత.

ఆయాసంతో గిలగిలలాడుతున్నాడు రఘు, "కుంతలా! ఎక్కడున్నావు ? నీ ముగ్ధప్రేమలాలిత్యం ఎక్కడ కుంతలా, ఎక్కడ? ఏదీ ఒక్కసారి క్షమించాననవూ, ఒక్కసారి! నీవు... సునీతా ! ఎక్కడున్నావు. నీవూ క్షమించవా నన్ను! అబ్బ భరించలేను." మెలితిరిగిపోతున్న రఘుకు ఆదిరే గుండెలతో మరొక ఇంజక్షన్ చేసింది సునీత.

బిగిసివున్న గుప్పిటలోని పాలిపోతున్న వ్రేలినుండి నలిగిన కుంతల ఫొటోను సునీత చూసి నిర్విణ్ణురాలయింది. భగవాన్ ! ఏమిటీ పరీక్ష ! అక్కా ! ఎంత అదృష్టవంతురాలవు! అవును ! నీ నిర్మల మధుర ప్రేమకు తార్కాణం ! నీవు వెదజల్లే చిరునవ్వులు అలాగే ఉంచక్కా ! నీవు అదృష్టవంతురాలవు.

తన్మయంతో కన్నీరు కారుస్తున్న సునీత నర్సురాకను గమనించి కన్నీరు తుడుచుకుంది.

"వస్తున్నారు డాక్టర్ !" వినయంగా చెప్పింది నర్స్.

ఏమిటీ పిలుపనుకుంటూ ఆశ్చర్యంగా వచ్చిన సమత, మల్లిక్‌లు విచలిత అయి నిలబడిన సునీతను ముందుగా చూసి ఆశ్చర్యపోయారు. అధోవదనంతో భారంగా సైగ చేసింది సునీత. బల్లవైపు నిశితంగా చూసిన సమత, మల్లిక్‌లు ఒక్కసారిగా 'బావా !' అంటూ దిగ్భ్రాంతి చెందారు కంగారుగా. పరీక్ష చేస్తున్న అన్నవైపు చూస్తూ సమత గుసగుసలాడింది.

"మనమిప్పుడు డాక్టరుగా మన బాధ్యత నెరవేర్చుకోవాలి"

గంభీరంగా, వేదనాభరితంగా అన్న మల్లిక్ మాటలకు సునీత, సమత ఒకరినొకరు పరికించుకున్నారు.

స్మృతివచ్చినా మళ్ళీ వెంటనే కోల్పోతున్నాడు రఘు. కలవరిస్తూనే ఉన్నాడు.

"సునీతా! క్షమించు. నిన్ను చిత్రవధ చేశాను. క్షమించవూ ! క్షమిస్తావు సునీ క్షమిస్తావు. అందుకే కుంతల నిన్ను ఆశీర్వదించింది. నిన్ను ఎన్నుకొని ఈ పాపాత్ముడిని అప్పగించింది నీకు..."

ఒక్కసారిగా రక్తం కక్కుకున్నాడు రఘు. మల్లిక్ ఒక ఇంజక్షన్ చేశాడు. సమత సునీతవైపు జాలిగా చూస్తూ మధ్యమధ్య ఎర్రబడిన కనులతో రఘువైపు చూస్తూ అశ్రుస్రుతుల జలధిలో మునిగిపోతూ వుంది.

"అన్నా! ఎలా చేయాలి నేను చికిత్స !" భారంగా కన్నీటిని తుడుచుకుంటూ కూర్చుండిపోయింది సునీత.

విధి అనేది ఉందనీ, మానవులకతీతమైనది ఆవల అనంత వ్యాప్తిగా ఆవరించివుందనీ తెలుసుకోగలుగుతారు, బలీయమైన సంఘటనలవలన. అలాగే రఘుపరిస్థితిని గమనించిన సునీత, మల్లిక్, సమత తమలో ఆవరించిన కుంతల స్మృతుల మధ్య విధి కర్కశత్వాన్ని, బలీయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొని విస్తుపోతూ, తమబాధ్యతను నెరవేర్చటానికి ఉద్యుక్తులయ్యారు.

## 2

"ఎవరబ్బాయివి నీవు ?"

"నీ కెందుకు ?"

"కావాలి మరి నాకు"

"అయితే అమ్మ, నాన్న ఇద్దరూ లేరు నాకు"

"అయ్యో ! ఏం చదువుచున్నావు బాబూ?"

"ఫో ! ఇవన్నీ నీకెందుకు ? నేను చెప్పను."

"ఏమంటున్నాడండీ! వాడు వెధవ అయిపోయాడు. ఏం చేసేది ? తల్లి, తండ్రి లేని బిడ్డకదా అని దగ్గరకు తీస్తే నా నెత్తిమీద కూర్చున్నాడు. భయం భక్తి లేవు."

తలిదండ్రులు పోయిన జయరామ్‌ను చేరదీసింది విశాలాక్షమ్మ. బిడ్డలు లేనికారణాన, గారాబంచేసి దూరపుబంధువైనా అతిప్రేమతో చూడటంవల్ల ఇది కరుకుగల జయరామ్ పట్ల ఎదురుతిరిగింది. మాటకు మాట చెపుతూ, నిర్లక్ష్యంగా చదువు సంధ్యలయందు శ్రద్ధలేకుండా తిరిగే జయరామ్‌ను ఆచార్యులుగారు పలుకరించుటచూచి ఆనందించింది విశాలాక్షమ్మ. తరచుగా పొరుగువారింటికి వస్తూపోతూ ఉంటారు. ఆయన. బ్రహ్మచారి ఆధ్యాత్మికచింతన, సజ్జనత్వంతో కూడిన సంస్కారం, క్రమశిక్షణ - చక్కటి పద్ధతులతో శిష్యులను చేరదీసి శిక్షణనిచ్చి పంపిస్తూ ఉంటారు. ఏదో దివ్యానుభూతి కల్గుతుంది ఆయన ముఖం చూడగానే. మెత్తటి గంభీరస్వరంతో ఎంతటివారినైనా ఇట్టే ఆకట్టుకుంటారు. విశాలాక్షమ్మ జయరామ్‌ను ఆచార్యులగారికి అప్పగించి "బాబూ! ఈ బిడ్డను మీ కప్పగిస్తున్నాను. మీ దే బాధ్యత" అని నిశ్చింతగా ఉండిపోయింది.

ప్రేమగా జయరామ్ తలనిమురుతూ చల్లనిమాటలతో ఆచార్యులుగారు వెంటతీసుకుపోయారు ఆశ్రమానికి.

* * *

ఆశ్రమంలో జయరామ్ పూర్వజన్మసంస్కృతా అన్నట్లు సహజ తెలివితేటలు, కరుకుదనం వేరొకరూపాన్ని దిద్దుకున్నాయి. ఏ విషయమైనాసరే అతి తేలికగా గ్రహించే నేర్పు, అవసరమైన విషయాలలో అతిపట్టుదల, నిగ్రహంతో కూడిన క్రమశిక్షణా; సంఘానికి, వ్యక్తికి కావలసినంత

చక్కటి సంస్కారం, వినయం అన్నీ పట్టుబడినాయి. ఆచార్యులగారి ఆనందానికి మేర లేదు. అందరిలోనూ తన కెంతో దగ్గరకు జరిగాడు జయరామ్. తనలోని ప్రత్యేకతను అంది పుచ్చుకున్నాడా అనిపిస్తుంది. ఆ పసితనపు అల్లరంతా ఏమయినట్లు ? అవును ! ముందు చాలా బాధపెట్టాడు. కాని తనలో ఏముందోగాని తను కొద్దిగా కోపగిస్తేచాలు హడలిపోయేవాడు. భగవానునిదయవలన ఇప్పటి జయరామ్‌ను ఒక జ్ఞాన మూర్తిగానూ, ఆధ్యాత్మిక రహదారులను శోధించే సాధనా మూర్తిగానూ, త్యాగనిరతుడుగానూ, క్రమశిక్షణాపరుడుగానూ తీర్చిదిద్దకలిగానుగదా యని యువకుడైన జయరామ్‌ను తిలకిస్తూ తృప్తిచెందారు ఆచార్యులుగారు.

## 3

విశాలాక్షమ్మ సలహాతోనే తగిన వధువు శారదాంబతో వివాహం జరిపించి గృహస్థాశ్రమంలో ప్రవేశపెట్టి, జయరామ్‌ను ఆశీర్వదించి వెళ్ళిపోయారు సంతృప్తిగా ఆచార్యులుగారు. గుణవతి, వినయసహనాల్లకు మారుపేరా అన్నట్లు శారదాంబ త్వరలోనే భర్త ఆశయాలను, పట్టుదలను, క్రమ

శిక్షణను అవగాహన చేసుకుంది. భర్త ననుసరించి జాగ్రత్తగా మెలిగేది. సామాన్యంగా ఆడపిల్లలు తల్లిదండ్రులదగ్గరే కొంత ఒప్పు, వినయం నేర్చుకుంటారు. కాని శారదాంబ పూర్వాచారపరాయణురాలగు తల్లి శీతారావమ్మ చేతిలో ముగ్ధగా పెరిగింది. అయినా తన పటిష్టమైన వ్యక్తిత్వవిలువలతో, నిగ్రహంతో కూడిన క్రమశిక్షణతో శారదాంబను తనకు అనుకూలంగా త్వరలోనే మార్చుకోగలిగాడు జయరామ్. శారదాంబ జయరామ్‌ల ప్రథమసంతానం "కుంతల". అందిపుచ్చుకున్న తల్లి అవయవసౌష్టవం, మెరిసిపోయే జయరామ్ శరీరచ్ఛాయ, మాటకట్టుకువచ్చిందా అన్నట్టు విశాలమైన ఫాలభాగం, చిందులుత్రొక్కే పెద్దకళ్లు, లేత గులాబీల్లా చిన్న పెదవులతో అందాల రాణిగా జన్మించింది కుంతల. నొక్కునొక్కుల తుమ్మెదరెక్కల తలకట్టుచూసి జయరామ్ 'కుంతల' నామకరణం చేశాడు. ఎంతో అపురూపంగా పెంచుకోసాగారు. వెంటవెంటనే మల్లిక్, సమత జన్మించారు. మల్లిక్‌కంటే రెండుసంవత్సరాలు సమత చిన్నది. కాని కుంతలకున్న పసిమి రంగు, కుంతలముఖంలోఉన్న లేగులాబీ చిరునవ్వులచిందులు లేకపోయినా మల్లిక్, సమత కూడ ఆకర్షణీయమైన చల్లని వెన్నెలలా ఉంటారు. జయరామ్ తన జీవితానుభవాల ననుసరించి పిల్లల విషయంలో చాలా జాగ్రత్తగా మెసలసాగాడు. కొన్ని కఠిన నిబంధనలు తనచుట్టూ ఏర్పరచుకొని తన వ్యక్తిత్వానికి భంగం రాకుండా జీవించటం జయరామ్‌కున్న చక్కటి సంస్కారాల్లో ఒకటి. బయటి గ్రామస్థులలో జయరామ్‌పట్ల ప్రత్యేక గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి. మాటయందు గౌర

నము, మాట్లాడినది ఆచరించుట, ఆర్థిక విషయాలలో నిక్కచ్చి ముఖ్యంగా గ్రామస్థులను ఆకర్షించాయి. అది చిన్న పాలె మగుటవలన మణివలె ప్రకాశించసాగాడు జయరామ్. కావల సిన భోగాలతో జీవించుటకు సరిపడా ఉంది పిత్రార్జితం. అయినా నిరాడంబరత్వం, తూచితూచి మాట్లాడటం జయ రామ్‌కు అలవాటు. కపటం, ద్వేషం, మంచిచెడుల విచక్షణా రహితదృష్టి, ధూమపానంవంటి దుర్వ్యసనాలు; గర్వం, దర్పం వంటి పతనకారణమైన అల్పగుణాలు మచ్చుకైనా లేని జయ రామ్ అందరిలోనూ ప్రత్యేకవ్యక్తిగా రూపొందాడంటే ఆశ్చర్యమేమీలేదు. పిల్లలయందు శ్రద్ధ, వారి ఆరోగ్యనియ మాలయందు అతి పట్టుదల చూపిస్తూ వుంటాడు జయరామ్. అందరిలోనూ కుంతలకు ప్రత్యేకస్థానం. కుంతల మధురపదధ్వని, ముద్దుగొలిపే మాటలు, పెంకితనం, విశాలఫాలభాగంపైపడే నొక్కులకురులు, చిలిపిదనంతోటి గంభీరతలతో పసితనముండే కుంతల ప్రత్యేకంగానే వెలుగొందుతోంది. పిల్లలను ఆరో గ్యంగా అతిజాగ్రత్తగా పెంచుకునే శారదాంబ జయరామ్‌లకు సంసారమే ప్రపంచమైపోయింది.

# 4

"అమ్మా ! అమ్మా ! అక్క..."

"ఏమిటే సమతా ! ఏమిట్రా మల్లిక్ ?" ఆదుర్దాగా వచ్చిన శారదాంబకు వచ్చీరానిమాటలతో మల్లిక్ అక్కను చూపిస్తూ "అమ్మా అక్కనే కొత్తారు మాత్తారు" అన్నాడు.

"ఎందుకు కొట్టారురా నా బంగారుతల్లిని ?"

"పాతం రాలేదు"

"ఏమ్మా రాలేదూ ? ఎందుకని ?" చిలిపితనం, పెంకెతనంతో నవ్వుతూ చూసే కుంతలను ప్రశ్నించింది శారదాంబ.

"నాకు రాదు" అయిదుసంవత్సరాల బాల కుంతల మొండిగానే చెప్పింది. అక్కడే తోటలో పనిచేస్తున్న జయరామ్ తృళ్ళిపడ్డాడు.

"చూడండి ! ఇప్పుడే ఎంత పెంకిగా తయారయిందో !" శారదాంబ రిపోర్టు చేసింది.

"లక్ష్మిలాంటి నాతల్లిని అలా అనకు" జయరామ్ వచ్చి కుంతలను ఎత్తుకొని, "ఏమిటమ్మా పాఠం రాదూ ?" బుజ్జగిస్తూ అన్నాడు.

"ఎంత చదివినా రాదు పాఠం" బుంగమూతితో కోలకళ్ళను ఇంకా కోలగా త్రిప్పుతూ అన్న కుంతలను ముద్దుపెట్టుకుంటూ "అలా అంటే ఎలా అమ్మా ! చూడు; నేనిప్పుడు సంస్కృతం నేర్చుకుంటున్నాను. అదే వస్తుంది. బాగా చదివి

నీవు పెద్దఉద్యోగం చేయాలి మరి !" చిగురుటాకుల్లా ఉన్న చెక్కిళ్ళను నిమురుతూ అన్నాడు జయరామ్.

"అయితే మీకు వస్తుంది. నాకు రాదు మరి ! నేనేం చేయను నాన్నా ?" చేతులుత్రిప్పుకుంటూ ముద్దుగా అన్న కుంతల మాటలకు నవ్వుకున్నారు శారదాంబ జయరామ్‌లు.

"అక్కా రావ్వా, ఆలుకుందాం"

"నామీద అమ్మకు నాన్నకు చెప్పావుగా నేను రాను" మొండిగా తమ్ముడికేసిచూస్తూ అంది కుంతల.

"తంత అయితే"

'తన్ను చూద్దాము" అంది కుంతల.

మల్లిక్ నిజంగానే తప్పటడుగులతో కాలికున్న మట్టిని, బంగారంలా మెరిసే కుంతలపాదాల్పై రాశాడు చిలిపిగా. శుచి, శుభ్రితల నందిపుచ్చుకున్న చిన్నారికుంతలకు ఎక్కడలేని కోపమూ వచ్చింది. చిన్నపుల్ల తీసుకొని తమ్ముడివెంటబడింది. మల్లిక్ పరుగిడుతున్నాడు తల్లిదగ్గరకు తప్పటడుగులతో. కెట్టింపు వేగంగా కుంతల పరుగిడుతూ వెళ్ళి గోడకుకొట్టుకుంది.

'అమ్మా !' అంటూ బాధతో మూల్గింది.

మల్లిక్ సమత బిత్తరపోయారు. అక్క కాస్త ఏడిస్తే చాలు తమకు దెబ్బలుతప్పవని ఆ పసిహృదయాలకు తెలుసు. భయంగా చూస్తూ నిలబడిపోయారు.

కుంతలను చూసిన శారదాంబ ఆత్రంగా తడిగుడ్డ తెచ్చి గాయాన్ని తుడవసాగింది. పసిమిరంగు పూలరేకుపై చిన్న

రంధ్రింలా కుంతల పాలభాగంచిట్లి రక్తం స్రవించింది. జయరామ్ చూచి, సమత మల్లికలను పిలచి ఉరిమిచూశాడు కోపంగా. తండ్రికోపం గమనించిన సమత, మల్లిక్ గడగడలాడిపోయారు. పరిస్థితి గమనించిన కుంతల తన చిన్నిబుర్రకు పని కల్పించింది.

"నాన్నా ! మరే, టీచరు పన్నెండుసంవత్సరాలవరకు చేసే అల్లరికి భగవంతుడు క్షమిస్తాడని చెప్పింది. మరి మీరూ క్షమించవచ్చుగా."

ముద్దులొలికే కుంతలమాటలూ, ఉదారత ఆ దంపతులను ముగ్ధులను చేసింది.

* * *

కాలం పరుగిడుతూ ఉంటుంది. కాలంతోపాటు తమకు తెలియకనే సుఖజీవులు పరుగిడతారు. కాలం ఎంత గడిచిందో కూడ తెలియదు.

# 5

శివరాత్రి ఉత్సవాలు, రంగురంగుల రంగవల్లిలు, క్రొత్త లక్కల సువాసనలు, పచ్చని తాటాకులపందిళ్ళు, కర్పూర నూనెలు, అగరవత్తుల వాసనలు, ఫలపుష్పవిభూతుల సుగంధాలు, పట్టుబట్టలతో, వజ్రవైఢూర్యాలతో అలంకరించుకొని పెండ్లికూతురయిన పార్వతిని క్రీగంటచూసే సర్వేశ్వరుడు దేవాలయములో నిండుగా— ఏదో దివ్యానుభూతి కలుగుతోంది. నిండు ముత్తయిదువులు పట్టుచీరలగరగరలతో, స్వేదబిందువులతో తడిసిన కుంకుమ రేఖలు పులుముకొన్న ముఖాలతో పళ్ళెరములలో పూజాద్రవ్యములు నింపుకొని ఈశ్వరుని సేవించివస్తూ పోతూ దేవాలయానికి క్రొత్తఅందాలను అందిస్తున్నారు. శివరాత్రి ఉత్సవాలలో ఎక్కడెక్కడనుండో గాయకులు వస్తూవుంటారు. హరికథలు, నాటికలు జరుగుతూ ఉంటాయి. దేవాలయ ట్రస్టీ సహృదయుడు, దైవచింతకలవాడగుటవలన ఎంతో చక్కగా జరుగుతాయి ప్రతిసంవత్సరమూ. ఆ రోజు ద్వారంవారి కచేరి. జయరామ్ ఎక్కువగా ఏకాంతంగానే గడుపుటకిష్టపడేవాడయినా తప్పనిసరిగా శివరాత్రి ఉత్సవాలకు హాజరయ్యేవాడు. ద్వారంవారి వాయులీను సప్తస్వరాల ఆరోహణ అవరోహణలతో దేవాలయప్రాంగణాన్ని ఏవోలోకాలలో విహరింపజేస్తోంది. జయరామ్ తన్మయుడై ద్వారంవారి నైపుణ్యాన్ని శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. పక్క వాయిద్యాల అనుకరణ ఎంతో రమ్యంగా వుంది. పదిసంవత్సరాల కుంతల జయరామ్‌దగ్గర కూర్చుని నిశ్శబ్దంగా వింటోంది.

కాని ఆమె దృష్టి అంతా రెండుచేతులతో వయ్యారంగా పట్టి వ్రేళ్ళతో నాట్యంచేయిస్తున్న వీణావాయిద్యంపైనే ఉంది.

"నాన్నా !"

జయరామ్ ప్రక్కనున్నవారు కుంతలవైపు చూసి ముగ్ధమోహన సౌందర్యానికి విస్తుపోయారు.

"నాన్నా ! ఆ వాయించేది ఏమిటి నాన్నా ?" వీణ వైపు చూపిస్తూ కుతూహలంగా అడిగింది కుంతల.

"వీణమ్మా అది !" నలుగురయిదుగురు ఒక్కసారిగా అన్నారు.

"నాకూ కావాలి నాన్నా! నేనూ నేర్చుకుంటాను."

విని నవ్వుకున్నారు అందరూ. జయరామ్ పరిశీలనగా కుంతలవైపు చూశాడు. నిజమే ! చదువు ఇంకా వచ్చే అవకాశం ఎలాగూ లేదు. వీణనేర్పిస్తే బాగుంటుంది. అనుకున్న వెంటనే అమలుజరుపుట జయరామ్‌లో ఉన్న మరియొక విశేషము. వీణకొనుట, మాస్టరును నియమించుట వెంటనే పూర్తి అయినది.

కుంతల వీణముందు కూర్చుంటే వీణ అందముపులుము కున్నట్లుంటుంది కాని, వీణవలన కుంతలకేమీ సొంపులురాలేదు. సహజసౌందర్యముతో మెరిసిపోయే కుంతల హృదయంకూడా సౌందర్యవంతమయినదే. చదువు రానంత మాత్రాన మొద్దేమీ కాదు. అవివేకిలా ప్రవర్తించదు. పది సంవత్సరాల కుంతల పదిహేను సంవత్సరాల వయసున్నదానిలా ప్రవర్తి

స్తుంది. అమ్మకు చిన్న, చిన్నపనులు చేస్తూ సహాయం చేస్తుంది. తమ్మునికి చెల్లికి తన జలతారు చిన్నారి చేతులతో తలలుదువ్వుతుంది, నీళ్ళుపోస్తుంది. తండ్రివస్తువులన్నీ తండ్రికి నచ్చిన క్రమపద్ధతిలో అమరుస్తుంది. చిన్నచిన్న మొక్కలు తెచ్చి పాతుతూవుంటుంది. పువ్వులుకోసి మాలలుకడుతూ మురిసిపోతూ ఉంటుంది. వయస్సుకుమించిన నమ్రత, ముగ్ధత్వానికి మించిన అమాయకత్వము ప్రతిబింబించే కుంతల మోము చూడగానే జయరామ్‌కు ఎంత చిరాకుకలిగినా ఇట్టే మాయమవుతుంది. శారదాంబకు, కుంతల పెరిగి పెద్దదయిన కొలదీ చిన్నచిన్న బాధ్యతలు తప్పసాగాయి. కుంతలలేనిది క్షణము నిలువలేదు; కుంతల ఎక్కడికయినా వెళ్ళి ఒకగంట ఆలస్యముచేస్తే భరించలేదు. ఇల్లంతా బోసిగా ఉన్నట్లు తోస్తుంది. చదువు మాన్పించి వీణనేర్పిస్తున్నందుకు శారదాంబకు ఒకందుకు తృప్తికల్గింది. కుంతల వీణాసాధనలో చిత్రమయిన పట్టుదల చూపిస్తోంది. శారదాంబ, జయరామ్‌లకు ఆనందముతో పాటు ఆశ్చర్యం కలిగింది. హెచ్చుస్థాయిలో కుంతల కంఠస్వరము ఏవో అనుభూతులను కలిగించేలా ఉంటుంది. వీణమాష్టరు కుంతల పట్టుదలను చూసి ఎంతో మెచ్చుకున్నారు. జయరామ్‌కు ఒకవిధముగా తృప్తికలిగింది.

# 6

మానవులజీవితాలు కోరికలవలయముచుట్టూ చక్రముగా తిరుగుతూ ఉంటాయి. ఆ వలయక్షేమాన్ని బట్టి ఈ తిరుగుట ఆధారపడిఉంటుంది. జయరామ్ ఆదర్శభావాలు బిడ్డలను తీర్చిదిద్దుటలో మెరుగులుదిద్దుకుంటున్నాయి. కుంతల నవయవ్వని అయింది. వీణాసాధనలో తృప్తికరముగా సాధన చెయ్యకలిగింది. మల్లిక్ శిష్యప్రాకారము పూర్తిచేశాడు. సమత తర్వాతారము చదువుతూంది. జయరామ్ ఆదాయముకూడా పెరగసాగింది.

ఆరోజు సంధ్యాసమయము, పరిగెత్తుకుంటూపోయే జీవుల చిరుచెమటలను తన నవ్యకాంతుల వింతవింతరంగులతో ప్రకాశింపజేస్తోంది సంధ్య. అప్పుడే స్నానము ముగించిన నవయవ్వని కుంతల సంధ్యారాగాలు ముఖంపై పడుతూ ఉండగా వీణ తీసుకొని రాగాలాపన ప్రారంభించింది. తెల్లని పావడా కుంతలసౌందర్యానికి జరీలా అందమిచ్చింది. జయరామ్ శారదాంబ, మల్లిక్, సమతలు కుంతల వీణానాదములో లీనమయ్యారు.

"జయరామ్‌గారూ"

"ఎవరూ ?"

జయరామ్ లేచి గేటుదగ్గరకు వెళ్ళాడు.

"రండి రండి" సాదరంగా ఆహ్వానించారు దేవాలయ ట్రస్టీ శ్రీరాములుగారిని జయరామ్.

"అమ్మాయిపాట వినిపిస్తుంటే వచ్చానండి"— తన రాకను తెలియజేస్తూ అన్నారు శ్రీరాములుగారు జయరామ్‌ను అనుసరిస్తూ.

"ఆపావే అమ్మా పాడూ"

కుంతలని చూస్తూ అన్నాడు జయరామ్. వెన్నెలలు చిమ్మే కుంతల సౌందర్యం ఏదో అద్భుతశక్తి ఆకర్షించిందా అన్నట్లుగా ఉన్న కుంతలగాత్రం శ్రీరాములుగారిని మైమరపించినట్లుచేశాయి; "నిన్ను వినా దిక్కెవరె" భక్తిరసముతో రాగభావయుక్తముగా ఆలాపిస్తోంది. అందరూ తన్మయులై వింటున్నారు.

పాట పూర్తిచేసి కుంతల చిరుచెమటలు పమిటతో అద్దుకుంటూంది; చిరునవ్వుతో శ్రీరాములుగారు జయరామ్‌ని చూస్తూ ఆప్యాయముగా,

"రేపు శివరాత్రికి అమ్మాయి పాటకచేరి పెట్టండి. అమ్మాయి అభివృద్ధిలోకి వస్తుంది."

అందరూ ఆనందించారు శ్రీరాములుగారి ఉదార స్వభావము చూసి. ఇంకా ఊళ్ళో విషయములు మాట్లాడి శ్రీరాములుగారు వెళ్ళిపోయారు.

"అక్క పాటకచేరిచేస్తుందా అమ్మా !"

సమత ఆశ్చర్యముగా అడిగింది. అమాయకంగా ముగ్ధగా ఉండే అక్కగుణాన్ని తూచుకుంటూ.

"అవునే, మీరు చదువుకొని డాక్టర్లయితే నాతల్లి గానకచేరీలు చేస్తుంది, పేరు తెచ్చుకుంటుంది"

"అమ్మా అంతమందిలో ఎలా పాడాలమ్మా ?"

సిగ్గుపడుతూ అన్న కుంతలవైపు పరీక్షగా చూసింది శారదాంబ.

"ఏమిటమ్మా సిగ్గుపడేది ? నలుగురిలో మెప్పు పొందినప్పుడే విద్యాప్రావీణ్యము తెలిసేది" మెరిసేకళ్ళతో కూతురు వైపు చూస్తూ అన్నాడు జయరామ్.

"అవునమ్మా, చెల్లీ, తమ్ముడూ, నేనూ, నాన్న ఉన్నామనే అనుకో. అధైర్యపడితే నీవు చేసిన సాధనకు ఒక రూపము రాదు" తిరిగి ప్రోత్సాహాన్నిస్తూ అన్నది శారదాంబ.

"నేనయితే అక్కా వెంటనే పాడేస్తాను, నీలాగా సిగ్గుపడతాననుకున్నావా ?" చెకుకుతింటూ గర్వంగా అన్న చెల్లి వైపు చూసి మౌనంగా నవ్వుకుంది కుంతల.

"నా బంగారుకుంతలకు దుష్యంతు డెక్కడున్నాడో ?" స్వగతములో అనుకుంటూ బయటకు వెళ్ళాడు జయరామ్, కుంతల నిడుపాటి జడసౌందర్యము చూసి. కుంతల జడ వెనుకకు వేసుకుంటూ చెక్కిళ్ళు ఎఱ్ఱబడగా కళ్ళు వాల్చుకుంది.

"అమ్మా పాపం నాజడే పెద్దది అక్కజడకంటె"

బుంగమూతి పెట్టుకుని అన్న సమతను చూసి నవ్వుతూ శారదాంబ-

"ఆ చిన్నినోసలూ నువ్వా, అక్కతో నంతా"

"చూడండి నాన్నా ? అవునులే మీరూ అక్కవైపేగా" రుసరుసలాడింది సమత.

"నీవు ఎన్నైనా చెప్పు. నీ కోపము అక్కకు లేదు. నీ తొందర అంతకంటె లేదు. ఇంక నీ కోతిమొఖము అక్కకు అసలే లేదు" వెక్కిరిస్తూ అన్న మల్లిక్ మాటలు సమత కోపాన్ని రెట్టింపు చేశాయి. ఏమరుపాటుగా వెళ్ళి మల్లిక్‌ను ముందుకు తోసింది. కాని తప్పించుకున్నాడు బలంగా మల్లిక్.

"దీనికింత కోపమయితే ఇది డాక్టరేం చేస్తుందండీ" అన్నది శారదాంబ సమతని పరిశీలిస్తూ.

"ముందు వాడి చదువు పూర్తిఅవనీ, తరువాత ఈ అమ్మగారు కానీ, సమత అదృష్టవంతురాలు శారదా ? మన పాలిట లక్ష్మి. అది పుట్టిన దగ్గరనుండే మనకు బాగా కలిసి వస్తోంది."

"నా కేమీ ఆ బిరుదులవసరము లేదు లే. అందమయిన అక్క మంచిది, ఆ నల్ల వాడు, అల్లరివాడు, ఆ కోతి మంచి వాడు. నేనేగా చెడ్డదాన్నింకా" రుసరుసలాడే మూతి త్రిప్పుకుంటూ వెళ్ళిపోయింది సమత.

# 7

ధనుర్మాసం. కన్నెలవలపులు తెలిపే బంతుల ఘుమ ఘుమలు, హరిదాసుల భక్తిగీతాలు, పచ్చని గడపల ప్రాంగణం లోని పిండిముగ్గుల పువ్వులజల్లులు, ధాన్యపుగారాలు నింపు కుంటూఉన్న రైతులదరహాసాలు సంక్రాంతికి నిండుతనాన్ని తెస్తున్నాయి. జయరామ్ పాలెంవచ్చి చక్కటి మేడకట్టు కున్నాడు. కుంతలసౌందర్యంలా మేడతళుకులుకూడా ఆకర్ష ణీయంగా ఉన్నాయి. పందిరంత పెద్దముగ్గుపెట్టి గొబ్బెమ్మలు నిండుగ అమర్చి, పసుపుకుంకుమ రేఖలు పులుముకొని, పువ్వుల ఘుమఘుమలు గుబాళించగా పమిటచెంగు నడుముకు గుచ్చి వెనుదిరిగి ముగ్గులు చూస్తూ తృప్తిగా తల్లి దగ్గరకు వచ్చింది కుంతల. అమ్మా ! ఒకసారి వాకిట్లో ముగ్గులు చూసి వెళ్ళవూ ?" అంది.

తలయెత్తిచూసిన శారదాంబ ఉషోదయకిరణాలతో పోటీపడుతున్న కూతురి సౌందర్యం చూసి ముగ్ధురాలై నీ సౌందర్యం, నీ సౌమ్యగుణంకంటె అవి బాగున్నాయా అమ్మా అని స్వగతంలో అనుకొని "చూస్తాలేమ్మా ! కాస్త ఈకూర తరుగమ్మా !" అంటూ పనిలో లీనమయింది.

"అమ్మా ఆకలవుతోంది"

"అమ్మగారు ఇప్పుడే లేచారు కాఫీలు దయచేయండి"

"పాపం ! ఇప్పుడే లేచా ! నీకంటె ముందే లేచా నులే !"

"లాంభ మేమిటి ? చదువుతూ నిదురపోయావుగా!"

"నీవు చూశావా అక్కా ! నీవు గొబ్బిళ్ళు చేస్తున్న ప్పుడు చదువుకుంటూనే ఉన్నానుగా."

"ఏమిటే గొడవ ! అక్కతో వంతుపెట్టుకుంటున్నావా సమతా ! అయినా నీన్నసేపని ఏముంది. అక్కకి చదువు భాగ్యం లేదు. ఎలాగో దాని భవిష్యత్తు." నిట్టూర్చిన తల్లి బాధగు సుర్తించిన కుంతల గలగలనవ్వి "ఏమిటమ్మా ! వీణ సరస్వతీదేవి కదూ. సాహిత్యసంగీతాలు చదువుకాదూ !" మెరిసేకళ్ళతో అంది కుంతల.

సమత మెల్లగా అక్కచెవిలో వూదింది.

"అక్కా, ఈరోజు భోగిబొమ్మలు దించనా అటక మీాదనుండి"

"దించుదాము. నేనూ వస్తాను అయిపోయింది."

"కాదక్కా, నేనూ పనిచేస్తాను గబగబ" అంటూ సమతకూడ పనిచేయుట ప్రారంభించింది. అక్కడే తోటలో పనిచేస్తున్న జయరామ్ సమత పనిచేయుట గ్రహించి "ఈ రోజింత ప్రశాంతంగా ఉందేమిటా అనుకున్నాను. చిన్నమ్మ పనిచేస్తోందా ?"

నవ్వుతూ అన్న భర్తను గమనించి శారదాంబ,

"అలాగే ఆడపిల్లను గారాముచేయండి, పనులు బాగా నేర్చుకుంటారు"—కోపాన్ని అభినయిస్తూ అంది శారదాంబ.

సమత, కుంతల ముసిముసిగా నవ్వుతున్నారు. అమ్మా నాన్న మాటలలోనికిదిగారని గ్రహించి, మెల్లగా బొమ్మల దగ్గరకు జారుకున్నారు.

"మన కుంతల బంగారుతల్లి! ఎన్నినోములపంట శారదా మనకు"

"దాని భవిష్యత్తుకూడా సుఖంగాఉన్ననాడు అనుకోవాలి మనం. ఆడపిల్లకు భర్త మంచివాడయితే నేగదండీ అదృష్టం"

"నీ పిచ్చిగానీ నేనంత తెలివితక్కువవాడను గాను. మనతల్లికి దుష్యంతుడను వెతికి తీసుకువస్తాను."

"ఇప్పుడే పెళ్ళేమిటండీ! వీణాసాధన మూలపడుతుంది. రేపు శివరాత్రికి ప్రోగ్రామ్ పెట్టించాలిగా. దాని అభిరుచినిబట్టి మనమూ చేస్తేమంచిది."

కుంతల పెళ్ళయితే అత్తగారింటికి వెళ్ళిపోతుంది. తన కన్నులు అంధకారం అయిపోతాయనే శారదాంబకు దిగులని జయరామ్ గ్రహించాడు.

"అలాగేలే! రెండుసంవత్సరాలవరకు తొందరే ముంది. పధ్నాలుగేగా!"

సంతృప్తి నిండిన దరహాసంతో భర్తవైపు చూసింది. శారదాంబ.

బొమ్మలుతుడుస్తున్న అక్కవైపుచూస్తూ సమత,

"అక్కా- నీకు ఈ సీతారాములంటే ఇష్టమా, రాధా కృష్ణులంటే ఇష్టమా" అంది.

"నాకు రాధాకృష్ణులే ఇష్టం. కృష్ణుడు రాధను ప్రేమించి నట్లు రాముడు సీతను ప్రేమించలేదు. వారిది రసభరితమై అమరత్వాన్ని పొందిన ప్రేమ. ఈ సీతారాములది పరిస్థితుల కనుగుణ్యంగా కట్టుబాట్లతో ఉన్న ప్రేమ."

"అయితే, అక్కా- ఎప్పుడూ విడవకుండా ఉంటే రాధా కృష్ణులకు ఒక్క-దినంకూడ పోట్లాటరాదే ?" అమాయకంగా అడిగింది సమత.

"కృష్ణుడిపై రాధ, రాధపై కృష్ణుడు ప్రేమరసాన్ని నవరంగులతో కలిపి ఒకరిపై ఒకరు బాహ్యాలోకాలను, బాహ్యాపరిస్థితులను మరచి వెదజల్లుకున్నారు. వారికి పోట్లా టెందుకు వస్తుందమ్మా ! వారికి చుట్టూ ఉన్నవి సంఘటనలు పరిస్థితులు రావు! అమరుల క్రీడాభిలోకం" మెరు స్తున్న కళ్ళల్లో ఇంకా మెరుపులను రుద్దుకుంటూ చిరునవ్వుతో అంది కుంతల.

"ఇవన్నీ నీకెలా తెలుసక్కా-"

తల ప్రక్క-కుతిప్పి అక్క-ముఖంలో ముఖం పెట్టి కొం టెగా అడిగింది సమత.

"ఏమో ఆయన నడుగు"

కృష్ణునివైపు చూపిస్తూ అంది కుంతల.

"సరిగ్గా తుడుపు దుమ్ముఉంటుంది."



"ఫో! అయితే నీవే తుడుచుకో"

అంతలోనే రుసరుసలాడిన చెల్లిని పరీక్షిస్తూ,

"పెద్దదానివవుతున్నావు, అయినా నీకోపం తగ్గలేదు" అంది కుంతల గంభీరంగా.

"లేకపోతే నీవే శుభ్రంగలదానివి, నేను లేనిదానినా?" అమాయకంగా ఉన్న ఆ కళ్ళను చూసి కుంతల నవ్వుకుంది. ఏమిటో గుసగుసలు విన్పించి వచ్చిన శారదాంబ బొమ్మలు చూసి విస్తుపోయింది.

"నాకు చెప్పకుండానే దించారటే! తలంటుకుంటారని నేను పిలుస్తూఉంటే."

"అమ్మా! నీవు పనేమీ చేయవద్దు. అక్క, నేను చేసి పెట్టుకుంటాము" అంది సమత.

"ఈ సంవత్సరము మల్లిక్ ఉన్నాడుగదమ్మా! వచ్చే సంవత్సరము కాలేజీకి పోతాడు వాడు."

"అయితే వాడుకూడ పెట్టుకుంటాడటే బొమ్మలు." విస్తుపోతూ అంది శారదాంబ.

ఒక్కసారిగా పకపకనవ్వారు అక్కాచెల్లిళ్ళు.

"ఏమిటే కబుర్లు పనివేళ" అంటూ వచ్చిన జయరామ్‌ను చూపిస్తూ శారదాంబ,

"పిల్ళ్ళు చూడండి ఏంచేస్తున్నారో!" అన్నది.

"ఏంచేస్తున్నారు, బొమ్మలు తుడుస్తున్నాను" చిరునవ్వుతో అన్నాడు జయరామ్.

"తండ్రీ బిడ్డలు చేయండి చాకిరి. నేను చేయలేను బాబు" విసుక్కుంటూ వెళ్ళింది శారదాంబ.

"అక్కా నేను తుడువనా బొమ్మలు" మల్లిక్ కొంటెతనంతో అనునయంగా అడిగాడు అక్కను.

"నీకో నమస్కారం బాబూ! వద్దు ఫో ఇక్కడనుండి"

"నేను పోను, తుడుస్తా! అక్కా ! అక్కా! ఈబొమ్మ చూడు, గౌను ఓ ఆంగ్లో ఇండియన్‌లా ఉంది కదూ. బేట్ తీసుకొని ఎక్కడికో బయలుదేరినట్లుంది. అబ్బ ఎంత బాగున్నాయి"

"అరేయి. నీవు ముందు పోతావా పోవా? పగలగొడతావురా! ఫో"

ఒకదెబ్బ వేసింది కుంతల. మరల కొట్టాడు మల్లిక్ కుంతలను. ఈలోపు ఒకబొమ్మ మల్లిక్ కాలుకు తగిలి పగిలి పోయింది. జయరామ్ శబ్దమువిని పుల్ల తీసుకొని మల్లిక్‌ను కొట్టబోయాడు. కుంతల తండ్రిముఖంచూసి భయపడింది.

"నాన్నకు కోపంవస్తే ఇంతే" ననుకుంటూ ధైర్యంగా తండ్రిఎదుటకు వచ్చి

"నాన్నా ఆ పుల్ల ఇలాఇవ్వండి. పదమూడు రాబోతున్నాయి వీడు ఇంకా చిన్నవాడేనా కొట్టేందుకు" అడ్డు పడింది కుంతల.

ముద్దుముద్దుగా ఆరిందాలా అన్న కుంతలమాటలకు శారదాంబ, జయరామ్ లిద్దరూ ఆశ్చర్యపోయారు.

నాతల్లికి వినయమువస్తోంది అనుకుంది శారదాంబ. బంగారుతల్లి దేనికైనా అర్హురాలే అనుకున్నాడు జయరామ్, పుల్ల అవతల గిరాటువేసి. తండ్రి ఉగ్రరూపం తెలిసిన మల్లిక్ అక్కవలన శాంతించినందుకు మరొకసారి అక్కను మెచ్చుకున్నాడు.

## 8

జడకుచ్చులు వయ్యారంగా కదులుతూ ఉంటే మహలు మల్ లంగా ముదురునీలం కుంతల అందాన్ని కొట్టవచ్చేటట్లు చేసింది. షిఫాన్ తెల్లపావడా, లేత నీలంజాకెట్ కన్నార్పకుండా చూడాలనిపించుతోంది. ముత్తయిదువులకు కుంకుమ పెడుతూవుంటే అందరూ వాకిటివరకు వచ్చి సాగనంపి ఏదో వెన్నెల ప్రకాశించిపోయిందా అన్నట్లు ఇంట్లో వెలవెల బోయే తమబిడ్డలను చూసి ఉసూరుమనుకుంటున్నారు.

వచ్చిన ముత్తయిదువులకు పళ్ళు, పసుపు కుంకుమలు ఇస్తూ కళకళలాడుతూ తిరిగే కుంతలసౌందర్యం పున్నమి

చంద్రుని సోయగంవలె పరిపూర్ణత చెందిందా అనిపించింది శారదాంబకుకూడ. ప్రతిసంవత్సరం క్రొత్తఅందాన్ని దిద్దుకుంటోంది నాతల్లి అని సంతృప్తినిండిన కళ్ళతో నిండుగా తనివితీరా కూతురినై పుచూస్తూ, ఎక్కడ పెరుగుతున్నాడో ఈ లక్ష్మికొరకు, అని అల్లుడిరూపాన్ని ఎంచుకోవాలని ప్రయత్నించింది శారదాంబ.

*　　　*　　　*

శివరాత్రిఉత్సవాల సంరంభంలో భక్తులగుంపులలో, దేవాలయసభా ప్రాంగణంలో అడుగుపెట్టింది భయంభయంగా కుంతల. నల్లని జార్జిట్ పై ఎరుపు తెలుపు పూల పావడా తెల్లటి లంగా, తెల్లబ్లౌజు ధరించిన కుంతల సౌందర్యం విరజిమ్ముతోంది సభంతా. జయరామ్ సభికులమధ్య ఠీవిగా కూర్చున్నాడు. శారదాంబదృష్టిఅంతా కుంతలమీదే ఉంది. నాతల్లికి దిష్టితగులదుకదా అని భయపడుతోంది. సమత మల్లికల గర్వం చెప్పవలవి కాదు. ప్రారంభమయింది పాటకచేరీ. ఊపిరి బిగపట్టి మరీ వింటున్నారు ప్రేక్షకులంతా. "ఎందరో మహానుభావులు" రాగయుక్తంగా, తేనెలా సాగిపోయే కంఠంతో అమృతంకలిపినట్లున్న వీణా వాయిద్యకలయికతో అతి మనోహరంగా పాడింది కుంతల. ముగ్ధులయ్యారు అందరూ. అనుకున్న గీతాలకంటె నాలుగు ఎక్కువపాడి కుంతల అలసిపోయినా ప్రేక్షకులకు ఇంకా ఇంకా వినాలనే కుతూహలంగా ఉంది. చిరుచెమటలు ఆవరించిన అందాలభరిణ కుంతల అలసినట్లు గమనించిన శ్రీరాములుగారు స్టేజీమీదకు వచ్చి,

"ఈ అమ్మాయి ఇంత బాగా పాడి మె... తో చి ఈ కచేరీ పెట్టించాను. భవిష్యత్తులో అష... రాణిస్తుంది. సౌందర్యానికి తగినట్లు చక్కటి క్రమశి... స్వతీకటాక్షం, లక్ష్మీదేవి దయ పొందిన ఈ సౌభా... రాలగు చిరంజీవిని ఆశీర్వదిస్తూ ఈ కుంకుమభరిణ కాను... యిస్తున్నాను" అంటూ ముగించగానే కరతాళధ్వనులు మ్రోగాయి. కుంతల సింహదంతో సౌమ్యంగా తల్లి దగ్గరకు వచ్చింది. అందరూ గుమిగూడి శారదాంబఅదృష్టానికి పొగడ నారంభించారు. ఉక్కిరిబిక్కిరి అయిన శారదాంబ జయరామ్‌లు నలుగురిలోనూ మెప్పు తెచ్చిన కూతురికి దిష్టితీసి సంతృప్తిగా నిట్టూర్చారు.

* * *

మానవుడి కోరికలు ఆశయాలు అన్నీ తీరకపోవచ్చు గాని అవి ఆదర్శమైనవి అయినపుడు వాటిస్మృతులు మిగిలినా రాణిస్తాడు మానవుడు.

కచేరీజరిగిన తరువాత అందరికీ సంగీతమందు ప్రోత్సాహం ఎక్కువైంది. క్రొత్త క్రొత్త రాగాలతో శుధ్యమంలో నికినచ్చినట్లు కుంతల సంగీతం రాణించింది. ఎన్నో వంపులు, ఎంతో నిండుతనం, ఎంతో రాణింపు వచ్చింది సంగీతంలో.

కాని భగవానుడితత్వం తెలిసికూడ కోరికలభూమిలో దున్నుతూనే ఉంటాడు మానవుడు.

మల్లికకు అకస్మాత్తుగా పెద్దజబ్బు చేసింది. పాలెంలో డాక్టరుకు సాధ్యంకా లేదు. బస్తీకి వెళ్ళవలసివచ్చింది. ఒకరోజు

కుంతల

...లు కాదు, ఆరుమాసాలపాటు మల్లిక్ పోరాడాడు. జయరామ్, శారదాంబలకు కంటి ...లేదు. ఎట్టిపరిస్థితిలోనూ ఆరోగ్యనిబంధనలు ఉల్లం... జయరామ్‌కు ఈ జబ్బు అశనిపాతమైంది. కుంతల వంట హాస్పిటల్‌కు తీసుకువచ్చి దైన్యంగా ఉన్న అమ్మానాన్న ముఖాలు చూడలేకపోయేది. కొంటెగా అల్లరిచేస్తూ ఎప్పుడూ ఏడ్పించే తమ్ముడి అస్థిపంజరం చూడలేక దిగమింగుకునేది. అమ్మ నాన్న ఇంకా బాధపడతారని కుంతల.

"నాన్నా! మీరే ఇలాఉంటే అమ్మ ఇంకెలా ఉంటుంది. భోంచెయ్యండి నాన్నా" అంటూ ధైర్యంచెప్పి భోజనంపెట్టే కూతురిని చూసి శారదాంబ తల్లడిల్లిపోయేది.

"అమ్మా! నీ సుకుమార చేతులతో వంటచేయిస్తున్నానమ్మా" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

జయరామ్ నిగ్రహించుకొని శారదాంబకు ధైర్యాన్ని చెప్పి తను తిని, శారదాంబను బలవంతాన ఎంగిలిచేయించేవాడు. ఎలాగైతేనేం, డాక్టర్లు మృత్యుముఖంనుండి బయటకు త్రోసివేశారు మల్లిక్‌ను. మల్లిక్ చిన్నహృదయంలోని కపుడే ఉదయించింది డాక్టరు కావాలని.

నెమ్మదిగా కోలుకోసాగాడు మల్లిక్. ఇంటికి తిరిగి వచ్చారు. ఊళ్ళోనే తల్లి ఉండటంవలన శారదాంబ, శీతారావమ్మ ఆసరాగా సమతను ఇంటివద్ద ఉంచివెళ్ళింది. కాని కుంతలపోషణ తప్పిన ఇల్లంతా దుమ్ముపట్టి బావురుమంటోంది.

నౌకర్లు కుంతలమ్మగారు లేనందున మాకేమీ తోయుట లేదని మొర పెట్టుకున్నారు. కుంతల ఇల్లంతా చక్కగా తిరిగి అలంకరించింది. తండ్రితో పాటు తోటంతా తిరిగి బాగుచేసింది. లేత చిగుళ్ళు కుంతల సుకుమారహస్తాలవల్ల పెరుగ ప్రారంభించాయి. బంధువులు వచ్చి మల్లిక్‌ను పలుకరించి వెళ్ళిపోయారు.

బాగా కోలుకున్నాడు మల్లిక్. పి. యు.సి.కి అప్లైచేశాడు గాని శారదాంబ అనుమతించలేదు, ఈసంవత్సరానికి వద్దని. మమత శారదాంబతల్లి శీతారావమ్మ దగ్గర ఉండి ఫోర్త్‌ఫారం పూర్తిచేసింది. శారదాంబ వివాహానికి పూర్వమే శారదాంబ తండ్రి మరణించుటవలన జయరామ్ చూస్తూఉంటాడు, అత్తగారి వ్యవహారాలన్నీ. శారదాంబకు చెల్లి వనజ, తమ్ముడు ప్రసాద్ వున్నారు. అల్లుడు ముక్కుసూటితనం, నిష్కర్ష, మంచి నడవడికి శీతారావమ్మ ఎంతో మెచ్చుకుని గౌరవిస్తుంది. వనజకు జయరామ్ సంబంధంచూసి శీతారావమ్మ అభిప్రాయానుకూలంగా వివాహంచేశాడు. కాని దురదృష్టజాతకురాలు వనజ. ఆ స్థితిఉందని జయరామ్ వరుడివిషయంలో పెద్దగా పట్టించుకోలేదు. అదీగాక జయరామ్‌కు ఈ విషయాలలో అనుభవం తక్కువ. వివాహమైన కొద్దికాలానికి తెలిసింది, వనజ భర్త రాజారావుకు లేని దుర్వ్యసనమంటూ లేదని. శారదాంబ చెల్లికష్టాన్ని చూసి విలపించేది.

"నాఖర్మ అక్కా! నీవు చేసేదిలేదు బావచేసిందీ లేదు" అని నిరాశపృక్కులతో నీరసంగా అక్కకు ధైర్యం చెప్పేది వనజ. ఆ స్థితిఅంతా కొన్నిసంవత్సరాలకే హారతికర్పూ

రంచేశాడు రాజారావు. రాజారావును దారిలోకి తీసుకు రావాలని చాలా ప్రయత్నాలుచేశాడు జయరామ్. ప్రయోజనం శూన్యమయింది. తనచేతులతో చేసిన ఈ సంబంధము ఇలా తారుమారైనందుకు జయరామ్ కుంతల విషయంలో సావధానంగా ఆలోచించిచేయాలని నిశ్చయించుకున్నాడు. బావమరిది ప్రసాద్, శీతారావమ్మకు ముద్దుల కొడుకు. తమశిక్షణ, మంచిఅలవాట్లు లేకుండా పెంచినబిడ్డలు ఎలా తయారవుతారో ప్రసాద్‌వలన తెలుసుకోవచ్చు. ప్రసాద్ దుర్వ్యసనాలకు అలవాటుపడ్డాడు చెడుస్నేహాలవలన. ఇది శీతారావమ్మకు తెలియదు. జయరామ్ గ్రహించాడు. కాని శీతారావమ్మకు, కుంతలను కోడలుగచేసుకోవాలనే కోరిక ఉందని శారదాంబ గ్రహించింది. జయరామ్‌కూ తెలుసు. వనజ వివాహానికే తలబొప్పికట్టిన శారదాంబ తమ్ముడివిషయంలో విరక్తిగా మౌనంవహించింది. ప్రసాద్ కూడ తల్లిదగ్గర తరచుగా మేనకోడలి సౌందర్యాన్ని పొగుడుతూ ఉండేవాడు. కుంతలంటే ఎంతో ప్రేమ ప్రసాద్‌కు. తండ్రి ఇచ్చిన ఆస్తి కావలసినంత ఉంది. తనకివ్వక ఇంకెవ్వరికిస్తాడు బావ, అనేగర్వంకూడ ఆవరించింది ప్రసాద్‌ను.

ఎంత మేనమామయినా తండ్రిక్రమశిక్షణలో కుంతల ప్రసాద్‌తో అంత చనువుగా ఉండేదికాదు. మేనమామయందు ఉండే భక్తిగౌరవాలు మాత్రం నిండుగా ఉన్నాయి కుంతల హృదయంలో. ఇది అపార్థంచేసుకున్న ప్రసాద్ కుంతల తన సొత్తేనని నిర్ణయించుకోసాగినాడు.

ఇద్దరి మనస్సు ఒకటే అగుటవలన ప్రసాద్ విషయంలో శారదాంబ జయరామ్‌లు నిర్లిప్తంగా ఉండిపోయారు. కాని లోలోపల శీతారామమ్మ కదిలిస్తుందని భయపడుతూనే ఉన్నారు. అనుకున్నంతా అయింది.

పండు వెన్నెల మధురస్వప్నాలను కలుగజేస్తోంది. మేడ మీద అందరూ పడుకొనిఉన్నారు. కుంతల కన్యావలపులలో ఊహాస్వప్నాలలో పూర్ణిమచంద్రుడిని చూస్తూ గులాబీ అధరాలపై చిరునవ్వును చిందిస్తోంది. జయరామ్ రామాయణంలోని రాముడిపాత్రను అన్నికోణాలనుండి విశదీకరిస్తున్నాడు శారదాంబకు.

“శారదా! శారదా!” పిలుపువిన్న శారదాంబ తృళ్ళిపడి గబగబా క్రిందికివచ్చి గేటుతీసింది. తల్లి శీతారామమ్మ—

“రా అమ్మా! ఇప్పుడు వచ్చావేమిటమ్మా! ఒంటరిగా! పైకి వెళదాము పద”

అకస్మాత్తుగా అలవాటులేని సమయంలో వచ్చిన అత్తగారినిచూసి అనుమానించాడు జయరామ్. తగ్గట్లే, ముందుగానే కుంతలవిషయం కదలించింది శీతారామమ్మ.

“ఈ సంవత్సరం కుంతల వివాహం చేయరా అబ్బాయి ?”

శారదాంబగుండె దడదడలాడింది. జయరామ్ వెన్నెలలో శారదాంబను పరిశీలించిచూశాడు. కుంతలప్రక్కలో ఉన్న శారదాంబ ప్రేమవాత్సల్యాలతో భయంగా కుంతల

తలను నిమురుతోంది. జయరామ్ నిర్భయంగా చెప్పటానికి జంకాడు. అత్తగారి మనస్తత్వాన్ని అనుసరించి—

"చెయ్యాలండీ ! ఈ సంవత్సరం వీణసాధనకూడ వెనుక బడింది."

"మరి ప్రసాద్‌కు సంబంధాలు వస్తున్నాయి. నేను బ్రతికుండగానే ఆ మూడుముళ్ళూపడితే బాగుంటుంది" ద్వంద్వార్థంగా అంది శీతారావమ్మ.

"అలాగేకానీయండి. కాని, వసజవిషయంలో నేను చాలా బాధపడుతున్నాను. మీరే ఆలోచించండి ప్రసాద్ విషయం"— తప్పుకున్నట్లుగా అన్నాడు జయరామ్.

"ప్రసాద్ కుంతలను చేసుకుంటే నాకు ఎంతో సుఖముంటుంది"

శారదాంబ జయరామ్‌లు ఒకక్షణం నొసలుచిట్లించు బాధగా. ఇంక లాభంలేదు చెప్పివేయాలనుకున్న జయరామ్,

"కుంతలకు ఒక గెజిటెడ్ ఆఫీసరును తీసుకురావాలని ఉందండీ" అన్నాడు నిర్భయంగా.

తమాయించుకోలేక విస్తుపోయిరది శీతారావమ్మ. అందాలభరిణ మనుమరాలు పరాయిది కాకూడదని నిర్ణయించుకున్నదగుటవలన, తన పెద్దరికాన్ని నిలబెట్టుకొనుటకు, జయరామ్ మాటలు పట్టించుకోనట్లుగా,

"అదేమిటి బాబూ ! నీవంటే నాకెంత గౌరవమో నీకే తెలుసు. నమ్ముకున్నాను ఆశతో. అలాగే అంటారు,

మీరు చిన్నవాళ్ళు. కుంతలకు బయటమాత్రం ఆస్తిపరులు ప్రసాద్‌లాంటివరుడు లభ్యమవుతాడని ఎక్కడుంది. మాట్లాడకండి, పెళ్ళిప్రయత్నాలు చేస్తాను" అంటూ ఇంకేమి వినవలసి వస్తుందోనని గబగబ వెళ్ళిపోయింది శీతారావమ్మ.

కుంతల, జయరామ్, శారదాంబలతో పాటు విస్తుపోయారు.

"ఏమిటండీ ! అలా ఊరుకున్నారేమిటి ?"

"ఏంచేయను విస్పించుకోండే ?"

భర్తకోపం గమనించిన శారదాంబ లాభంలేదని మౌనం వహించింది.

కుంతల అమ్మమ్మ కోరికకు నవ్వుకుంది తరువాత. ఇది జరిగేదికాదు. నాన్న, మావయ్యకు ఎప్పటికీ చేయరు. తండ్రి మీద గౌరవంతో తృప్తిగా మధురస్వప్నాలతో నిద్రాదేవి ఆలింగనంలో ఇమిడిపోయింది.

* * *

పై సంఘటన జరిగిన వారానికి శీతారావమ్మ ఒక ఎర్రటి సిల్కుకాగితంపొట్లం తెచ్చి చూపిస్తూ,

"శారదా ! ఇది చూడమ్మా ! పన్నెండు కాసులు పెట్టి చేయించాను. సూత్రం బాగుందా ? పప్పులు అవి చేయలేక బాధపడుతున్నాను కదా ! శాస్త్ర సహాయం చేయకూడదటే......" అంది.

భోజనం చేస్తున్న జయరామ్ అప్పుడే పూలచెండు అమర్చుకుంటూ వచ్చిన కుంతల, భర్తకు అన్నం వడ్డిస్తున్న శారదాంబ విస్తుపోయారు. శారదాంబ నెమ్మదిగా ఆదుర్దాను అణచిపెట్టుకుంటూ,

"ఏమిటమ్మా ! ఈ సూత్రమేమిటి ? పసుపేమిటి ?" అంది.

"ఏమిటే, కుంతలకే ఈ మాఘమాసంలో చేసేద్దాము పెళ్ళి" అంటూ ప్రతిమలా నిలబడిన కూతురిచేతిలో ఉంచింది. బంగారు గొలుసును శీతారావమ్మ.

జయరామ్‌కు ఇంతవరకూ అత్తగారిపై రానికోపం అవధులుదాటింది. కాని విచక్షణాజ్ఞానంకల జయరామ్ అత్త గారి తొందరపాటుకు జాలిచెందాడు. ఒక ఉపాయంతోచింది.

"ప్రసాద్‌ను సంప్రదించారా ?"

కుంతల, శారదాంబ విస్తుపోతూ చూశారు జయ రామ్‌వైపు.

"వాడినెందుకు అడగాలి ?" ఆశ్చర్యంగా అంది శీతారా వమ్మ.

"లేదు. ప్రసాద్‌ను సంప్రదించండి. తరువాత ఆలో చించుదాము." నిర్ణయించినట్లుగా మాట్లాడిన అల్లుడిమాటలు సబబేననితోచిన శీతారావమ్మ,

"అలాగేలే బాబూ ! రేపు శలవలకు వస్తాడుగా ! తెలుసుకుందాము" అంది.

ఒకవిధంగా భయపడిన శీతారావమ్మకు ధైర్యం వచ్చింది.

"వెళ్ళివస్తానే శారదా! ఇక్కడే ఉంచు గొలుసు" అంటూ వెళ్ళిన తల్లివైపే చూస్తూ నిలబడినభార్యను చూసి జయరామ్ నవ్వుతూ,

"అసాధ్యులే తల్లీకూతురూ" అన్నాడు.

చివుక్కుమంది శారదాంబ హృదయం. ఆడపిల్లలకు తలిదండ్రులను విమర్శించేందుకు తమకి మినహా ఎవరికీహక్కు ఉండకూడదని అనుకుంటారు. కాని శారదాంబకు కుంతల పంచప్రాణాల్లో ఒకప్రాణం. ఆ ప్రేమకారణంగా తమ్ముడి ప్రవర్తన తెలిసినదగుటవలన తన నిర్ణయం కఠినంగా అమలు పరుచుకోవాలనే నిర్ణయానికి వచ్చినందువలన జయరామ్ హాస్యానికి సర్దుకుంది.

"ఇదంతా మీ మెతకతనంవలన కాదూ" విసుక్కుంది. భర్తమీద.

చిరునవ్వుతో శాంతంగా అన్నాడు జయరామ్.

"నీ మూఖం! ప్రసాద్ ఇంత చిన్నవయసులో; అందులో చెడుస్నేహాలున్నవాడు పెళ్ళికి అంగీకరించడు. బాధ పడకు, ఇది జరిగేదికాదు."

"ఏమిటో అయోమయంగా ఉంది నాకు,"— ఆ వేదనతో అంటూ శారదాంబ కుంతలకొరకు చుట్టూ చూసింది. కనిపించలేదు. పైకి వెళ్ళింది. కుంతల పడుకుని ఉంది. గ్రహించిన శారదాంబ "నీకు బాధకలిగిస్తామా అమ్మా! మా

ప్రాణాల్నయినా ఇచ్చి నీవు సుఖపడేట్లు చేస్తాముగాని" అని అనుకుంటూ "ఎందుకమ్మా పడుకున్నావు? పూలు నలిగిపోతున్నాయి లే"— అంది. ఎర్రగ కందిన పాలబుగ్గలు కన్నీటి చారలతో తడిసిపోతున్నాయి. శారదాంబ హృదయం ద్రవించింది.

"లేదమ్మా లేదు. నీ కంటినీరు జారటానికి వీలు లేదు. నీవేం ఖంగారుపడకు. అంతా మనమంచికే జరుగుతుంది, ఏది జరిగినా" అంటూ కూతురిని హృదయానికి హత్తుకుంది శారదాంబ.

ప్రసాద్ ఇప్పుడు పెళ్ళేమిటన్నాడనీ, అంగీకరించలేదనీ విన్న జయరామ్, శారదాంబలు కుంతలతోసహా హాయిగా నిట్టూర్చారు. ప్రసాద్‌కు నిజంగానే పెళ్ళి అనేసరికి భయం వేసింది చిన్నవయసు కారణంగా. సీతారావమ్మ నీరసించిపోయింది.

ఆరోజు కూరలుతరుగుతూ అమ్మకు సహాయం చేస్తున్న కుంతల,

"మావయ్యను చూస్తే జాలివేస్తుందమ్మా"

"ఎందుకే" ఆశ్చర్యంగా అడిగింది శారదాంబ.

"అమాయకుడు, ఎలాగూ తనదానినేనని ఇప్పుడే పెళ్ళి వద్దు అనిఉంటాడు."

సిగ్గుపడుతూ దాచుకోనివిషయాలను చెప్పే కూతురి స్వభావం శారదాంబకు తృప్తినిచ్చింది.

"నాన్నగారు సంబంధాలు చూస్తున్నారమ్మా"

"ఎవరికమ్మా" అమాయకంగా అడిగింది కుంతల.

"ఇంకెవరికే, నీకే !" మెరుస్తున్న కళ్ళతో అంది శారదాంబ.

సిగ్గుపడిన కుంతల మెరుస్తున్న చెక్కిళ్లు మరీ మెరిసినాయి.

"అమ్మా ! అమ్మా"! పరిగెత్తుకుంటూ వచ్చింది సమత.

"ఏమిటే ఆ ఖంగారు ?"— చిన్నకూతురు దుడుకుతనం తెలిసిన శారదాంబ కోపంగా అడిగింది.

"ఎందుకమ్మా అంతకోపం ! నాకు ఫస్టు వచ్చింది. ఇవిగో ప్రజెంట్సు !" అంటూ బుంగమూతితో సోప్ బాక్సు, పెన్ను, పుస్తకం క్రింద పెట్టింది తల్లి దగ్గర.

"నీవు చదివే చదువుకు ఫస్టు కూడానా ?" ఆశ్చర్యంగా అడిగింది శారదాంబ.

"డిబేట్‌లో అమ్మా" గర్వంగా అంది అమ్మతో సమత.

"ఇంకేమిటి ! చదువులో కాదన్నమాట" పరిహాసంగా అంది శారదాంబ.

కుంతల నవ్వుతూ చెల్లికోపాన్ని పోగొట్టాలనే ప్రయత్నంలో "దేనిగురించి సమతా" అంది.

"స్త్రీ విద్యగురించి అక్కా ! నేను చదువు స్త్రీకి అవసరమని వాదించాను" అక్కయినా తన గొప్పతనాన్ని గమనించిందన్న ఉత్సాహంతో అంది సమత.

"నేనూ విన్నానులే ! మా చిన్నమ్మ డాక్టరవుతుందని నేను చెప్పలేదూ"

వెనుకగా వచ్చి అన్న తండ్రిమాటలు విని అప్పుడే వచ్చిన అన్నవైపు గర్వంగా చూసింది సమత.

"ఏమిటి పోజులుకొడుతోంది గయ్యాళి" కొంటెగా అన్నాడు మల్లిక్.

"అరేయి ముందు ప్రజంటివ్వు నాకు" అన్నను రెట్టిస్తూ అంది సమత.

"తెస్తానుండు" అంటూ పాతటోపి ఒకటి తెచ్చి సమత తలపై పెట్టి చప్పట్లుకొట్టాడు మల్లిక్.

సమత అన్నను కొట్టబోయింది. అందరూ కడుపుబ్బ నవ్వారు.

# 9

కాలం పరుగిడుతూనే ఉంటుంది. కాని ఈ కాలంలోని పగడాలను, ముత్యాలను కూర్చుకునేవారికే జీవితం అర్థమవుతూఉంటుంది. కూర్చుకొనుటే తెలియని అమాయకులకు జీవితం, కాలం అగమ్యంగానే గడచిపోతాయి.

మరల క్రొత్త సౌందర్యానుభూతులతో ధనుర్మాసం వచ్చింది. ఈసారి సంక్రాంతి కుంతలకు క్రొత్త వెలుగులను కొని తెచ్చింది. బంతుల పచ్చివాసనలలో, గొబ్బిళ్ళశోభలలో లేదూడల చిలిపికళ్ళల్లో, బిడియంపడుతూ వయ్యారంగా నాట్యంచేసే హరిదాసుల్లో కుంతలకు క్రొత్త క్రొత్త అనుభూతులు రాసాగాయి. క్రొత్తకోరికల కమ్మదనం, ఊహాసౌధాల మత్తుసౌరభంలో అరుణిమదాల్చాయి సొగసులుచిమ్మే కుంతల అందాలచెక్కిళ్ళు.

తీరికసమయంలో జయరామ్ ఆజ్ఞననుసరించి కుంతల రామాయణం, వేదాలవచనాలు, హిందీ, సంస్కృతం నేర్చుకుంటూఉంది. ఇల్లంతా చక్కటి ఆధునికపద్ధతులలో అలంకరించుతూ చెక్కుచెదరకుండా ఉంచుతుంది ఎప్పుడూ. ఇరుగు పొరుగువారు తమ బిడ్డలను, కుంతలపని, కుంతలసామ్యాన్ని మెచ్చుకుంటూ చాటుగా మందలించుటకూడ జరుగుతుంది.

బయటకు ఏ సమయంలోనూ రాని కుంతలను ఎప్పుడయినా చూసిన ఇరుగుపొరుగు ముగ్ధులయ్యేవారు. జయరామ్ పద్ధతులను మూర్తీభవించినట్లు జీర్ణింపచేసుకున్న కూతురి నేర్పరితనాన్ని చూసి జయరామ్ గర్వించుకూడ అనుభూతుంటాడు తరచుగా.

"జయరామ్‌గారూ"

ఆరోజు పేపరు చదువుకుంటున్న జయరామ్ తలఎత్తి చూశాడు. రామనాథంగారు, దూరపుబంధువు.

"రండి ! రండి !" సాదరంగా ఆహ్వానించాడు జయరామ్.

"శారదా ! రామనాథం బాబాయి వచ్చారు. నీళ్లు తీసుకురా" అంటూ కేక వేసి కుశలప్రశ్నలడిగాడు జయరామ్.

"నీ ఉత్తరం అందింది. కుంతలకు ఒకసంబంధం చూశాను. కుర్రవాడు చాలా బుద్ధిమంతుడు. కాస్త నలుపు. డాక్టరు చదువుతున్నాడు" చెప్పుకుపోయాడు రామనాథం.

"కట్నమెంతిలో ఉన్నదండీ"

"మీకు పిల్లవాడు నచ్చితే తరువాత మాట్లాడుకోవచ్చు"

"సరే, ఆలోచించుదాము. భోజనానికి లేవండి" అంటూ లోనికి దారితీశాడు జయరామ్.

"చూడు శారదా ! నలుపట. డాక్టరు చదువుతున్నాడట. మరి మనం అంగీకరిస్తే అమ్మాయిని చూడటానికి వస్తారట."

"నలుపా ? మరి నచ్చకపోతే అగౌరవం కాదండీ, చూచి వెడితే !"

"ఏం? మన బంగారుతల్లిలో ఏంలోటుందని అగౌరవం?"

శారదాంబగుండెలు మొదటిసారి ఆవేదనాభరితంగా కొట్టుకున్నాయి. కుంతలపెళ్ళి అయి అత్తగారింటికి వెడితే తనెలా జీవించాలో కళవళపడిన శారదాంబ ముఖకవళికలు గుర్తించిన జయరామ్,

"ఎంత గారాబంతో పెంచుకున్నా, ఎంత మనలను సుఖపెట్టినా, ఆడపిల్లన్న తరువాత అత్తగారింటికి వెళ్ళవలసిందే" బాధామిళితమైన మాటలతో నొక్కి-నొక్కి అన్న భర్తమాట

లకు శారదాంబ మరింత బాధపడింది. నా తల్లిని కన్నందుకు నేనెంత అదృష్టవంతురాలను అనుకుంటూ,

"సరే మీయిష్టం, నాదేముంది" అంది శారదాంబ.

తారీఖు నిర్ణయించి కుంతలను చూడటానికి రమ్మన మని చెప్పి రామనాథాన్ని సాగనంపివచ్చాడు జయరామ్.

"అమ్మా అక్కపెళ్ళా" సమత ఆవేదనతో అడిగింది.

చిన్నకూతురి బాధను గమనించిన శారదాంబకు కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.

"అక్కవెళ్ళిపోతే ఎలా ఉండాలి" స్వగతంలో అను కున్న సమతకు, తోటంలో ఆకుగులాబీలను త్రుంచి గుత్తిగా తీసుకొచ్చి నవ్వుతూ తనకిచ్చి ముగ్ధగా కళ్ళల్లోకి చూసే అక్కను చూసి కళ్ళల్లో నీళ్లు చిందాయి.

* * *

ఈ విషయం శీతారావమ్మకు తెలిసింది.

"ఏమిటే శారదా! నాకు మీ ఉద్దేశ్యాలు స్పష్టంగా చెపితే నేను ఆశలుపెట్టుకునేదాన్ని కాదుగా?" నిష్ఠూరంగా అంది శీతారావమ్మ.

"చెల్లి విషయంలో బాధపడుతున్న మాకు ప్రసాద్‌కు ఇవ్వాలని లేదమ్మా, రెండేళ్ళనుండి పి. యు.సి. లోనే ఉన్నాడు. అదీగాక ఉద్యోగస్తుడికిస్తే సుఖపడుతుంది. బంగారంలా పెంచుకున్నాము దాన్ని" నిశ్చయంగా ఉన్నదున్నట్లు అంది శారదాంబ.

ఈవిషయం ప్రసాద్‌వరకూ వెళ్ళింది. బాధపడ్డాడు. బావపద్ధతులే వేరు. అవును తను బావను అనుసరించలేక

పోయాడు, అదే కారణమయి ఉంటుంది. కుంతలను పోగొట్టుకో వలసివచ్చింది. ఈ పెళ్ళి జరుగకుండా ఉంటె బాగుండునని కూడ అనుకున్నాడు ప్రసాద్.

పెళ్ళివారొచ్చారు. పెళ్ళికొడుకు, అతని స్నేహితుడు మాత్రమే వచ్చారు. మామూలుగానే నిరాడంబరంగా కూర్చుంది కుంతల. అయినా పూర్ణిమచంద్రునిలా కాంతిసార భాలతో మెరిసిపోయే కుంతలసౌందర్యాన్ని చూసిన స్నేహితు లిద్దరూ తన్మయులయ్యారు. క్రీగంటచూసిన కుంతల ఒక్క సారిగా వణికిపోయింది. అబ్బ ఎంతనలుపు ! నాన్న కెలా నచ్చారు ? ఊ ! ఇంక ఒక్క క్షణంకూడ నిలువలేను...చివా లునలేచి తనకు తెలియని ఆవేశంగా కుంతల బయటకు వచ్చింది.

"అదేమిటే ! ఇలా వచ్చావు ?" ఆశ్చర్యపోతూ అంది శారదాంబ.

"అమ్మా ! నీవు చూశావా ! అలా చూడు ఒక్క సారి" నిలువలేక మరొకగదిలోనికి వెళ్ళిపోయింది కుంతల.

విస్తుపోయి శారదాంబ ఒక్కసారి పరిశీలనగా, ఆశ్చర్య పోతున్న స్నేహితులలో పెళ్ళికుమారుని గుర్తుపట్టి పరిశీలిం చింది. ఉలిక్కిపడింది ! ఏమిటి ? కుంతల ఎక్కడ ! ఈ అంద వికారమెక్కడ? వద్దువద్దు నాతల్లికి సంబంధాలు దొరకకపోవు. అయినా ముందుచూసి ఆలోచించుకొని రమ్మనవలసింది. అనవసరంగా అమాయకురాలిని బాధపెట్టవలసివచ్చింది. నాతల్లి ఎంత బాధపడుతుందో!

అప్పుడే బయటనుండి వచ్చిన జయరామ్ స్నేహితు లిద్దరూ బయటకూర్చుని మాట్లాడుకుంటూ తననుచూసి ఆపి వేయటం గమనించారు. అనుమానంగా లోపలికి వచ్చేసరికి అంతా నిశ్శబ్దంగాఉంది. శారదాంబ పరధ్యానంగా కూర్చుంది. కుంతల జాడేలేదు. భర్తరాకను గమనించిన శారదాంబ కోపం అవధులు దాటింది.

"దానిని ఎందుకలా బాధపెట్టటం ?"

"ఏమిటి శారదా ?"

"మరీ అంత నలుపు ? అందమనేది లేకుండా ఎలా నచ్చాడండీ మీకు ? మన తల్లిదగ్గరఉంటె కాకిముక్కుకు వజ్రాల హారం తగిలించినట్లే ఉంటుంది."

"అవును శారదా ! చూడగానే అనుకున్నాను. కాని గుణం, వ్యక్తిత్వం, సజ్జనత్వం మనిషిని రాణింపచేస్తూ, చేసుకున్న వారినికూడ సుఖపెడతాయి. ఈ గుణములున్నాయనే నేనూ ఓపికపట్టాను. కుంత లేదీ !"

జరిగినదంతా చెప్పింది శారదాంబ. బాధపడ్డాడు జయరామ్.

"సరే అమ్మకు ఇష్టంలేనిపని చేయడమెందుకు ? ఏదో ఉపాయం ఆలోచించుతానులే" అంటూ సాలోచనగా బయటకు, వచ్చిన భర్తనుగమనించి శారదాంబ మథనపడింది, ప్రారంభంలోనే ఇలా ఎందుకు జరిగిందా అని.

* * *

ఆరాత్రి కుంతలదగ్గరపడుకున్న సమత మెల్లగా అక్కను మాటలలోనికి దింపింది.

"అక్కా ! ఏమిటి, బావే నచ్చలేదా నీకు ?"

"అబ్బ ! బావనకు సమతా !"

"ఇలా అన్నిసంబంధాలకు ఏవో కారణాలు చెప్పె య్యక్క ! చక్కగా నాతో నే ఉండవచ్చు ఇక్కడ"

"నీవుంటావా ఇక్కడ ?"

"ఉండక ! నీవలె పెళ్ళిచేసుకుంటానేమిటి ? డాక్టరు చదువుతా !"

చెల్లి కోరికకు ముసిముసినవ్వులు నవ్వుకుంది కుంతల.

"అక్కా ! నీవు వెళ్ళిపోతే అమ్మకు ఎంతబాధ ! నాన్నకు ఎంతఇబ్బంది ! అమ్మచేసే ప్రతిపనిలోను వెనుకేఉండి అమ్మకు కష్టం కల్గించకుండా శ్రమపడనీయకుండా చూస్తావు. నాన్నవస్తువులు, బట్టలు అన్నీ నీచేతినుండి రావలసినదే. నౌకర్లంతా పెద్దమ్మాయిగారూ అంటారేగాని, రావటంతో ఇంట్లో ఎవ్వరినీ పిలువరు. మరి నీవు వెడితే ఎలాగక్కా !"

"నీవున్నావుగా ! ఇంకా ఒకసంవత్సరం ఇక్కడే ఉంటాను నేను."

"ఏమోనక్కా ! నీవులేని అమ్మను, ఇంటిని తలచుకుంటేనే భయమేస్తోంది."

"అదే అలవాటయిపోతుందిలే సమతా ! బాధపడకు."

చెల్లిని ఓదారుస్తూ అంది. ఇద్దరూ నిద్రకుపక్రమించారు.



కుంతల అందానికి ముగ్ధులయిన స్నేహితులిద్దరూ కన్నార్పకుండా చూస్తున్నసమయంలో చివాలున లేచివెళ్ళిన

కుంతలను గమనించి తెల్లబోయారు, పెండ్లికుమారుడు మధు గమనించాడు. "బంగారురంగుతో మిలమిలలాడుతూఉండే ఆమె ఎక్కడ ? నారూప మెక్కడ ? నన్ను చూసిఉంటుంది. నలుపునుచూసి భయపడిఉంటుంది. పోనీ లే, ఆ అమ్మాయికిష్టం లేకుండా ఎందుకు ? అందమయిన యువకుడు వరుడుగావచ్చి ఇద్దరూ కలకాలం సుఖంగాఉంటే చాలు" అని హృదయ పూర్వకంగా దీవించుతూఉండగా జయరామ్‌నుచూసి మరూనం వహించాడు స్నేహితునితో చెప్పుతున్న మధు.

లోపలికి వెళ్ళివచ్చిన జయరామ్‌ను గమనించిన మధు నిర్ధారణ చేసుకున్నాడు, తను వూహించినదే నిజమని.

"వెళ్ళివస్తామండి ! లెటరు వ్రాస్తాము"

ఆచారపూర్వకంగా అన్న మధుమాటలకు జయరామ్ ఏమీ బాధపడలేదు. వినయం సౌమ్యం ఉట్టిపడేట్లున్న మధు వైపు ఒకపర్యాయముచూసి భగవంతుడు అందంకూడ పెడితే అల్లుడయ్యేవాడు కదా అని నిట్టూర్చాడు. గమనించే ఉంటాడు యదార్థం. లేకపోతే ఇక్కడే పెళ్ళివిషయాలు మాట్లాడిఉండే వాడు. కుంతల మధ్యలో లేచివెళ్ళినందుకు పాపం ఎంత బాధ పడ్డాడో ! అని విచారించాడు.

"అలాగేనండి" ముక్తసరిగా అన్న జయరామ్ మాట లకు మధుమనస్సు చివుక్కుమన్నా, అంతలోనే సర్దుకొని అజ్ఞాతంగా కుంతలక్షేమాన్ని దీవించి శలవుతీసుకొని వెళ్ళిపో యాడు స్నేహితునితో.

# 10

సమత S. S. L. C. లోనికివచ్చింది. మల్లిక్ ప్రీప్రొఫె షనల్ చదువుతున్నాడు. కాలం ముందుకు నడుచుట లేదు. కుంతలమనస్సంతా చికాకుగా ఉంటోంది. తనెన్నో గాలి మేడలుకట్టుకుంది. నాన్నగారిలా గుణం, తనలాగా అందము ఉన్న వరుడుకావాలని కోరికటంచులకు నీరుపోసింది. కాని... జరిగింది వేరొకటి !

సంపెంగవాసనలలో, మాలతీసుమాలలో, ద్రాక్షగుత్తు లలో, మల్లెసుగంధంలో ఏవో మత్తుకలిగించే ఊహాలలో, తను ఊహాసుందరుని ప్రేమజల్లులు కన్పించేవి. కాని ఇప్పుడు భయం భయంగా ఉంటోంది. ఎక్కడ చూసినా వికృతంగా ఉన్న మధురూపమే కన్పిస్తోంది. భగవాన్ ! నీ కరుణాకటాక్షా లున్నాయని విశ్వసిస్తున్నాను. నీప్రేమకు పాత్రురాలను. నీవు నన్ను అంత దురదృష్టవంతురాలను చేయవద్దుప్రభూ! అని వేడు కొంది మనసులో.

గులాబీతోటలో తిరుగుతూ ఆలోచిస్తున్న కుంతల పాలుచిందే లేచిగురుటాకుల్లాంటి చేతివ్రేళ్ళు గులాబీముళ్ళతో పోటీపడ్డాయి. "అబ్బా" అనుకుంటూ వెనుకకు తీసుకుని రక్తాన్ని పిండింది.

"శారదా ! శారదా !" అంటూ వచ్చిన జయరామ్ వంటరిగా తిరిగే కుంతలను చూసి,

"ఏమిటమ్మా ఒక్కదానివే ఏంచేస్తున్నావు ?" అన్నాడు.

"ఏంలేదు నాన్నా !" సిగ్గుతో తడబడింది కుంతల.

"అమ్మ ఏదీ ? ఇంట్లో ఉందా ?" అని అడిగిన జయ రామ్ 'శారదా' అంటూ ఇంట్లోకి నడిచాడు.

"ఏమిటండీ ఆ ఖంగారు ?"

"ఈవేళ ఒక శుభవార్త !"

"ఏమిటది ? వెళ్ళివచ్చారా ?"

"వెళ్ళాను. నాకు నచ్చిన అబ్బాయిని చూశాను." మెరిసేకళ్ళతో అన్నాడు జయరామ్.

"అప్పుడే చూడటంకూడ పూర్తయిందా ?" విస్తు పోతూ అంది శారదాంబ.

"ఎంతా! పదిమైళ్ళేగా. సైకిల్ మీద వెళ్ళాను. బాబాయి ఉన్నారు. అబ్బాయిపేరు రఘు. చూడముచ్చటగా ఉన్నాడు. చక్కటి ఆకర్షణీయమైన ముఖం, పర్సనాలటీ. మన తల్లికి తగినవరుడు."

"అయితే చూడగానే నచ్చాడేమిటండీ మీకు"

"లేదులే ! అంత తెలివితక్కువవాడిగా తీసివేయకు మరి. మాట్లాడాను. అన్నికోణాలనుండి పరీక్షించాను. ఇలాంటి ఉత్తముడికోసమే నేను ఎదురుచూచేది. సౌజన్యం, చక్కటి సంస్కారం, ఇట్టే ఆకర్షించే మాటలలోని మెరుపుదనం..."

"ఇంతకీ మీకా కుంతలకండీ ?" భర్తధోరణికి పరిహాసంగా నవ్వుతూ అంది శారదాంబ.

కుంతల అన్నీ విన్నది. శరీరమంతా పులకరించినట్లయింది. ఎన్నో మన్మథునిబాణాలు తనను బంధించినట్లు అనుభూతిపొంది గబగబా మేడమీదికి పారిపోయింది. శారదాంబ జయరామ్‌లు చూసి నవ్వుకున్నారు.

"సరేగాని మరి కుర్రవాడి తలిదండ్రులతో మాట్లాడారా ? సాంప్రదాయం అదీ చూశారా ? అబ్బాయి ఏం చేస్తున్నాడు ?"

"అన్నిప్రశ్నలు ఒక్కసారిగా అడిగితే ఎలాగు ? ఎమ్. ఇ. ఫస్ట్‌లో ఉత్తీర్ణుడయ్యాడు మొన్ననే. విదేశాలకు వెళ్ళాలనే ఉత్సాహముండటంవలన, దానికి సంబంధించిన ట్రైనింగు చదవాలని అప్లయిచేశాడట. ఢిల్లీలో వస్తుందని అన్నాడు. మరి కుటుంబవివరాలు బాబాయిని అడిగి తెలుసుకున్నాను. తండ్రిస్వభావం కాస్త సంకుచితమన్నాడు. అయినా మనకు తండ్రితో సంబంధమేమిటి ? ఆస్తిపాస్తులు ఏమీ లేనట్లే! వ్యాపారంలో నష్టపోయారట. ముగ్గురు అబ్బాయిలు, ఒక ఆడపిల్లట. ఈ అబ్బాయి రెండో అబ్బాయి. పెద్దబ్బాయికింకా పెళ్ళికాలేదట. ఇద్దరికీ చూస్తున్నారట సంబంధాలు."

అంతా విని శారదాంబ తృప్తిపడింది.

"సరే మీఇష్టమే నా యిష్టము" అంది శారదాంబ.

భర్త అన్నీ తెలిసినవాడైనా తన సడగందే ఏదీ చేసే అలవాటులేదని తెలుసుకున్న శారదాంబ అన్నివిషయాలు అతి

అడగనే అడిగాడు.

"ఏం చదువుకున్నారు."

"పేరు కుంతల."

కావాలని తెచ్చుకున్న మొండితనంతో చెప్పి, ఒక్క సారిగా ఎవరూ లేరని గ్రహించి కళ్ళుపైకెత్తి చూసింది భయంగా, ఏం సమాధానం చెప్పాలా రెండవప్రశ్న కను కుంటూ.

ఆత్రంగా ప్రేమదృక్కులతో చూచే అతని చూపులతో ఒక్కసారిగా ఢీకొన్నాయి కుంతల చూపులు. అంతే ! వెంటనే కళ్ళు వాల్చుకుంది. ఒకరి అందానికి ఒకరు ముగ్ధులయ్యారు. క్రిందిపెదవి నొక్కుకుంటూ తనలో కలిగే సంచలనాన్ని అణచుకొనుటకు ప్రయత్నించింది కుంతల.

"వీణవాయిస్తారట, ఒక్కపాట..."

మృదుమధురంగా కోరిన కోరికను తిరస్కరించలేకపో యింది కుంతల. ఆ గదిలోనే ఉన్న వీణతీసుకుని శృతులు ఒక్క సారిగా మ్రోగించి కొంటెగా తెచ్చుకున్న ధైర్యంతో రఘు వైపు చూచింది. రఘు తన్మయుడయ్యాడు.

"ఎందరో మహానుభావులు" ఆజ్ఞాపించినట్లే అన్నాడు రఘు.

చిరునవ్వులు చిందిస్తూ మనోహరగీతంలో ప్రేమ రసాన్ని రంగరించి మరీ పాడింది కుంతల. బయటఉన్న పెళ్ళి అతిథులంతా చకితులయ్యారు. మా రఘు అదృష్టవంతుడని మురిసిపోయారు సంతృప్తిగా.

బయటకువచ్చిన రఘు ఏదో చెప్పబోయిన మామ గారిని, పెళ్ళిషరతులు మాట్లాడబోయిన పెద్దలను వారించి 'ఖాయం చేసుకోండి' అని ఆదేశించాడు. తనఫొటో పంపిస్తానని, అందాలుచిందే చిరునవ్వులు వెదజల్లే కుంతలఫొటో ప్రేమగా తీసుకున్నాడు. ఈ చొరవకు జయరామ్ ఆశ్చర్యంతో పాటు ఆనందించాడు.

"ఇప్పుడెలాగూ లగ్నాలు లేవుకదండీ ! నేను ఢిల్లీ వెడుతున్నాను. సీటువచ్చింది. రెండుసంవత్సరాలు పడుతుంది, పూర్తి కావటానికి. రెండు నెలలకు వస్తాను. అప్పుడు పెట్టుకుందురుగాని లగ్నాలు" అన్నాడు రఘు.

వినయంగా చెప్పిన అల్లుడిమాటలకు ఎంతో ఆనందించాడు జయరామ్.

"ఇంక వెళ్ళివస్తామండీ" అంటూ రఘు వెనుదిరిగి తెరలలోనికి చూస్తూ వెళ్ళిపోయాడు కారు దగ్గరకు.

తృప్తిగా సాగనంపి వచ్చిన జయరామ్ "ఏమ్మా ! దుష్యంతుడు నచ్చాడా ?" నవ్వుతూ కూతురివైపు చూశాడు జయరామ్.

సిగ్గుతో తలవాల్చుకుంది కుంతల.

"అన్నీ బాగానే ఉన్నాయి కానీ..."

శారదాంబ మాటలకు తృళ్ళిపడ్డాడు జయరామ్.

"ఏమిటి కాని...?"

"మోాయలేని బరువు కట్నం"

"ఓహొ ఇంతేనా ! మనతల్లి సుఖానికంటె రెండోది ఆలోచించనక్కర్లేదు" నిశ్చయంతో అన్నాడు జయరామ్.

"అమ్మా! అమ్మా!"

ఆనుర్దాగా పిలిచింది సమత.

"ఏమిటే ఆ ఖంగారు?" శారదాంబ అడిగింది.

"అన్నాయి వస్తున్నాడు. మరి కొడుకును పొగుడుకుంటారుగా నాన్న, నీవు. మార్కులు తెచ్చుకుంటున్నాడు, పేరూ తెచ్చుకుంటున్నాడు, అని. అందుకే పిలిచాను ముద్దుల కొడుకుకు దిష్టితీసుకుంటారని."

"ఏమిటు వాగుతున్నావు" అంటూ వస్తూనే చెల్లితలపై కొట్టి గబగబ తల్లిదగ్గర కూర్చున్నాడు సంతోషంగా మల్లిక్.

"అమ్మా! అక్కపెళ్ళి ఖాయమైందటగా. సరేగాని అక్కలేకుండా ఎలా ఉంటావమ్మా! అక్క కనిపించనిది ఒక క్షణం ఉండలేవుగదా"

ఆశ్చర్యంగా తల్లివెపు చూస్తూ అన్న మల్లిక్, చుట్టూ కుంతల అక్కకొరకు చూశాడు. గమనించిన శారదాంబ,

"స్నానంచేస్తోందిరా అక్క! అది సుఖంగా కాపురం చేసుకుంటుంటే నాకు మాత్రం సంతోషంకాదేమిరా?" అంది.

"అరేయి అన్నా! బావ చాలా బాగుంటారురా! అక్కను ఎన్నిప్రశ్నలడగారనుకున్నా..."

గబగబ చెప్పుకుపోతున్న సమతకు అడ్డువస్తూ శారదాంబ —

"పరీక్షలు బాగా వ్రాశావా! ఆరోగ్య మెలాఉంది" అంది.

"వ్రాశానమ్మా! ఆరోగ్యం బాగానేఉంది."

"చెప్పమ్మా! నువ్వెందుకు చెబుతావు. అన్నా! అక్క వెళ్ళిన మరునాడు మనిద్దరిని అసలు చూడదురా అమ్మ." కెట్టించి అడిగింది సమత తల్లిని.

స్నానంముగించుకొని వచ్చిన అక్కనుచూసి మల్లిక్ చకితుడయ్యాడు. అక్క చాలా పెద్దయినట్లుగా ఉంది. కాస్త వొల్లుచేసింది. ఏదో చెప్పలేని కళవచ్చింది. బావ రాకముందే ఇంత అందంగా ఉంటే, వస్తే ఇంకెలా ఉంటుందో!

"ఎప్పుడొచ్చావురా! అలా చిక్కిపోయావే! అంత బాగా చదివావా?" తమ్ముడు తనవైపే చూస్తున్నందుకు సిగ్గు పడుతూ అంది.

"నీవు పెద్దదానివయ్యావనుకొంటున్నావా అక్కా! సరేగాని వీణ మూల పారేశావా?"

"దాని వీణ నీ జబ్బుతోనే మూలబడిందికదరా! ఆ మాష్టరుకూడ వెళ్ళిపోయాడట ఎక్కడికో."

"ఇంకెందుకమ్మా! ఢిల్లీ వెళ్ళి రాణీగారు అవుతుంది. వీణ ఎందుకు" అక్కవైపు చూస్తూ కొంటెగా అన్నాడు మల్లిక్.

"నీవాగుడు సరేగాని పదరా స్నానానికిలే." గదమాయించింది తమ్ముడిని కుంతల.

*  *  *

"కుంతలా! కుంతలా!" తండ్రిపిలుపు విన్న కుంతల గబగబ వచ్చింది.

"శుభ బహుమానం నీకు."

తండ్రిచేతిలో నీలంకవరుచూసి గుండె దడదడలాడింది కుంతలకు. చిరుచెమటలతో ఫాలభాగం తడిచిపోయింది. సిగ్గుతో కుంచించుకొని లోనికి వెళ్ళబోయింది.

"రాఅమ్మా! వెడతావే! నీకే వ్రాశాడు రఘు. నాకు ఒకటి వ్రాశాడు. ఇదిగో నీకవరు" అందించాడు జయరామ్.

దడదడలాడుతూ చెల్లి, తమ్ముడు చూడకుండా పైకి తనగదిలోనికి వెళ్ళి తలుపులుమూసి మరీ విప్పింది కవరు, అదిరే గుండెలను అదిమిపెట్టుకొని.

"నిన్నుచూసిన ప్రథమక్షణమే, నాకోసమే నీవున్నది" అన్పించింది. కాని గడుసుదానవని గ్రహించాలే! మరి లెటరు వ్రాస్తావా" అంటూ కొద్దిలో ముగించిన లెటరు పది సార్లన్నా చదివివుంటుంది. వింత అనురాగవల్లరిలు పూడసూపాయి. అందమైనకన్య ప్రియుడిభావనలో సృష్టిలోని అందాన్ని అంతటినీ ప్రోగుచేసి తెచ్చుకుంటుందని తెలుస్తుంది కుంతల ప్రఫుల్లవదనం చూస్తే.

"ఏమని వ్రాశారు రఘు" శారదాంబ కూతురిలోని మార్పును గమనించి అడిగింది.

"ఏమీలేదమ్మా! అనవసరంగా కవరు పాడుచేశారు. నేను గయ్యాళిలాగా కన్పించానట" సిగ్గుపడుతూ అధోముఖంతో చిరునవ్వులొలికిస్తూ అన్న కూతురిసౌందర్యకాంతులకు శారదాంబ పులకరించిపోయింది.

"నేనూ వ్రాయనా అమ్మా!" జంకుతో అడిగింది మెల్లగా తల్లిని కుంతల.

"వ్రాయమ్మా! ఆయన వ్రాసినపుడు వ్రాయకపోతే బాగుండదు" కూతురి సంతోషం కంటె తనకు కావలసింది లేదని తృప్తిగా అంది శారదాంబ.

"అక్కా! బావ లెటరు వ్రాశారా" పదహారేళ్ళ మల్లిక్ అక్కను ఆశ్చర్యంగా అడిగాడు.

"పోరా నీకు చెప్పేదేమిటి?" అన్నకు అడ్డువస్తూ అంది సమత.

"ఏమిటి? మళ్ళీ అను" వెంటపడ్డాడు మల్లిక్.

"అమ్మా అన్న చూడు" తల్లికి రిపోర్టు చేసింది సుమత.

"అమ్మా అన్న చూడు" చెల్లిని అనుకరిస్తూ వెక్కిరించినట్లన్నాడు మల్లిక్.

"అరేయ్. మీ గల్లంతు మానండి ముందు" అంటూ తమ్ముడిని చెల్లిని కొట్టబోయింది కుంతల.

నవ్వుకుంటూ తల్లి వెనుకకు చేరారు సమత, మల్లిక్.

# 12

ఉషోదయంతో గర్వంగా, ముగ్ధలా మేలిముసుగు అనే మంచు తెరలోనుండి వయ్యారంగా వళ్ళువిరుచుకుంటూ సుగంధసౌరభాలను చిమ్ముతున్నాయి పారిజాతాలు. సుకు

మూర లావణ్యవతి నాసికలా పారిజాత తొడిమలు కొట్టవచ్చి నట్లుగా ప్రోగుచేసి పూలనుండి కన్పిస్తున్నాయి. అందాల ఖరిణి కుంతల ముఖారవిందంలోని మందహాసరేఖా పారి జాతాల తెలుపుదనంలోని హాయిలావుంది.

జయరామ్ సరదాగా పారిజాతాలన్నీ ప్రోగుచేసి దండ కడుతూఉంటే, తన తెల్లని తామరతూడుల్లాఉండే చేతులతో కుంతల పూలన్నీ అందిస్తోంది తండ్రికి. ఉషోదయ అద్భుత సౌందర్యంలో కుంతల రాగరంజితముఖారవిందము వింతగొలు పుతూ భాసిస్తోంది. అప్పుడే చదువు దగ్గరనుండి లేచివచ్చిన సమతకు అక్క అందము ఏదో లోకానికి తీసుకుపోయినట్లు కన్పిం చింది. తన అందం తనకే ఎబ్బెట్టుగా తోచినట్లనిపించింది. అక్కడే అక్కవైపు చూస్తూవున్న అన్నను పలుకరిస్తూ,

"అరేయి అన్నా! అక్క వెళ్ళిపోతే ఎలాగురా! రేపు అక్క మామగారు వస్తారట మాట్లాడటానికి" దిగులుగా అన్న చెల్లివైపు కొంటెగా చూస్తూ మల్లిక్,

"నీవిక్కడే ఉంటావా ఎప్పుడూ" అన్నాడు.

"నేనుండక ఎక్కడికిపోతాను. అందరినీ వెళ్ళగొట్టి నీవే ఉండాలనుకుంటున్నావా? అమ్మా! అమ్మా వీడు చూడు ఏమంటున్నాడో" రుసరుసలాడుతూ అమ్మదగ్గరకు రిపోర్టుఇస్తూ వెళ్ళింది సమత.

"ఏమంటున్నాడే" పనిలోఉండి పరధ్యానంగా అంది శారదాంబ.

"నన్నూ అత్తగారింటికి పొమ్మంటున్నాడు" బుంగ మూతిపెట్టింది సమత.

కుంతల జయరామ్‌లు ఫక్కున నవ్వారు. శారదాంబ నవ్వును ఆపుకుంటూ.

"ఇంకాకా పెద్దవాళ్ళవుతున్నారు. చిన్నతనపు అల్లరి ఇంకా పోలేదు రండి, త్వరగా పాలు త్రాగుదురుగాని" పనిలో లీనమయింది శారదాంబ.

"పదమ్మా! అమ్మకు కోపమొస్తే నిన్ను, నన్నుకూడ దండిస్తుంది" అంటూ జయరామ్‌కూడ వచ్చాడు లోనికి.

"రేపేగా, వియ్యంకుడు వచ్చేది?"

"రేపేగా లెటరులో ఉంది?"

"కోడలను చూస్తాడులే!" నవ్వుకుంది శారదాంబ.

"అమ్మా! అక్క నిజంగా వెళ్ళిపోతుందా" బాధగా అడిగాడు మల్లిక్.

కుంతలకు మొదటిసారిగా ఏదో వేదన ఉదయించింది. తను పుట్టి పెరిగిన ఈఇల్లు వదలివేయాలా? అమ్మ, చెల్లి, తమ్ముడు నాన్న అందరినీ వదలిఉండాలా?—ఎక్కడ—వారి దగ్గర...ఎప్పుడూ వారిదగ్గరే ఉంటానా...

ఆడపిల్లలకు ఇది ఒక పెద్ద సమస్య. తలిదండ్రులమీద బెంగ, భర్తబాహువుల్లో చిత్రమైన అనుభూతి, కలగా పులగమై ఏదో ఒక అనుభూతిని కల్గిస్తుంది.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు? బాధపడుతున్నావా? లేక ఢిల్లీ ఎలా ఉంటుందా అని ఆలోచిస్తున్నావా?" కూతురి లోని భావాలను వూహిస్తూ అన్నాడు జయరామ్.

"ఈరోజు లెటరు రావాలికదూ!"

"అవున్నాన్నా–" సిగ్గుపడుతూ అంది కుంతల.

"ఉత్తరం వచ్చేవరకూ ఇంతే పరధ్యానం. ఢిల్లీలో ఏభాష మాట్లాడుతారో, రేపు ఢిల్లీలో ఎలా ఉండాలో కలలు గంటూఉంది" నవ్వుతూ అంది శారదాంబ.

"అక్కా! ముందుముందు మాతో అసలు మాట్లాడతావా?" కొంటెగా అడిగాడు మల్లిక్.

"పోండి!" అంటూ లేచివెళ్ళింది కుంతల.

రఘు లెటర్సు కుంతలలో ఎంతో మార్పు తెస్తున్నాయి. ఎన్నో విషయాలతో చక్కటిభాషతో, రంగురంగుల కాగితాల మీద మనోహరంగా వ్రాసే భర్త ఉత్తరాలను అతిజాగ్రత్తగా దాచుకుంటోంది కుంతల. వెంటనేవెంటనే ముగ్ధమోహనంగా ముద్దుముద్దుగా, ప్రేమనంతా రంగరించి విరహవేదనతో కూడిన వాడి అయిన బాణాలను వదులుతూ తనూ వ్రాస్తోంది. ఒక్కరోజు లెటరు ఆలస్యమయితే అక్కడ రఘు, ఇక్కడ కుంతల పోష్టుజమానుకు ఏ యాక్సిడెంటు జరిగిందోనని ఆదుర్దా చెందుతున్నారు. కుంతలలోని మార్పులు స్పష్టంగా తెలుసుకున్న గులాబీబాలలు ఫక్కున నవ్వాయి చామంతులు వెక్కిరించాయి. మాధవీలత పులకరించి విరగబూసింది. సంపెంగలు కొంటెతనంతో మత్తుకలిగిస్తున్నాయి. మల్లెలు పెళ్ళిబాజాలు మ్రోగిస్తున్నాయి. కృష్ణానది నాజూకుగా వయ్యారంగా కుంతలను వెక్కిరిస్తూ నడయాడుతోంది. ఒకచోట పెట్టవల్సిన వస్తువు పరాగ్గా ఇంకొకచోటుకు వెళ్ళిపోతోంది.

తండ్రి "అమ్మా నా షర్టులు ఎన్ని ఉన్నాయో చూడు అన్న తండ్రిమాటకు,

"అలాగే నాన్నా" అంటూ ఠీవిగా కవ్విస్తూ చిలిపిగా నవ్వే భర్త ఫొటోవైపు చూస్తూ కలలుగనేది, నాన్న సంగతి మరచిపోయి.

"అమ్మా కుంతలా, ఈకూర తరగమ్మా" అన్న తల్లి పిలుపువిని, పరధ్యాన్నంగా కోస్తూ (వేలుకోసుకునేది. చెల్లి సమతతో, ఫిల్లీ ఎలా ఉంటుందో, బావస్నేహితులతో తనెలా మసలుకోవాలో కబుర్లు చెప్పుతూ ఉండేది.

తండ్రి లైబ్రరీనుండి ఎప్పుడూ రామాయణంతీసే చేతులు ఇప్పుడు కాళిదాస మేఘసందేశం, శకుంతల తీస్తున్నాయి.

తనలో మార్పునుచూసి కొంటెగా నవ్వుకుంది కుంతల. వెన్నెల ఒక్కసారి ఫక్కున నవ్వింది కుంతలతో కలసి.

రఘుతండ్రి కృష్ణయ్య వచ్చాడు. అతిథిమర్యాదలు సలక్షణంగా జరిగాయి. ఇంటిశోభ, లక్ష్మీనిలయంలో ఉన్న అలంకరణ, జయరామ్ వినయము చూసి సంతోషించవలసిన కృష్ణయ్య, ఈర్ష్యతో బాధపడ్డాడు. తనుండవలసిన మార్గమిది. తనదురాశ కారణంగా ఉన్నదంతా పోగొట్టుకోవలసివచ్చింది.

"అమ్మా టిఫిన్ తీసుకురా"

— జయరామ్‌మాటలకు కృష్ణయ్య ఆలోచనలు ఆగి పోయాయి.

కనకాంబరపు సిల్కుజరీచీరతో, నిడుపాటిజడతో, అద్భుత సౌందర్యవతిలా వచ్చిన నవవధువు కుంతలను చూడ గానే కృష్ణయ్య హృదయం విప్పారింది.

"నీ పేరేమిటమ్మా!"

"కుంతల" సమస్కరించి వినయంగా చెప్పింది కుంతల.

అలాగే తనవైపు చూస్తున్న మామగారిని చూసి సిగ్గుపడి కుంతల అడుగులోఅడుగు లేస్తూ లోనికి వెళ్ళిపోయింది.

"ఏమండి! పెద్దఅబ్బాయికి వివాహం కుదిరింది, రేపు 20 వ తేదీన లగ్నపత్రిక వస్తుంది." గర్వంతో కూడినట్లున్న మాటలతో చెప్పాడు కృష్ణయ్య.

"మంచిదండి!" రఘుకు ఇంకా నెలవరకు శెలవులు లేవట! ఉత్తరం వ్రాశాడు."

ఉలిక్కిపడ్డాడు కృష్ణయ్య. ఏమిటి? మామగారికి లెటరువ్రాశాడా. తనను సంప్రదించకుండానే? మామగారి వలలో పడిపోయాడన్నమాట! ఎంతపెంచినా చివరికి జరిగేది ఇదన్నమాట......

వియ్యంకుడిలోని మార్పులను గమనించిన సూక్ష్మగ్రాహి జయరామ్ మాటమారుస్తూ,

"ఎప్పుడు చేయాలని వివాహం?" అన్నాడు.

"ఇద్దరికీ ఒక్కలగ్నమే బాగుంటుంది. పై నెలాఖరులో పెట్టించానులగ్నం." దర్పంతోకూడినట్లున్నాయి మాటలు. ముళ్ళమీదకూర్చున్నట్లు లేచాడు కృష్ణయ్య.

"ఇంక వెళ్ళివస్తానండి"

"అలాగే, మంచిదండీ!"

సాగనంపివచ్చి భారంగా నిట్టూర్చాడు జయరామ్. అయినా రఘుహృదయం నవనీతంలాంటిది. ఎవరెలాంటి వాళ్ళయితే ఏంలే అని తృప్తిపడ్డాడు జయరామ్.

(9)

# 13

సృష్టిలో ఎప్పుడూ చిత్రమైనవే జరుగుతూఉంటాయి. ఎవరికివారే ఈ చిత్రాలు ఎదుటవారిలోనే చూడాలని కోరు కుంటారు. ప్రభువిన్యాసంలో ఇది అతిరహస్యమైన విశేషం. ఎక్కడో బెడ్డవిసిరి పరిహాసంగా నవ్వుతాడు సర్వాంతర్యామి. అది ఎవరికి ఎప్పుడు తగులుతుందో ఎవరికీ తెలియదు. తెలుసు కున్న తరువాత ఆ గడ్డనుండి రక్షించుకోవాలని ప్రయత్నించే మానవుణ్ణిచూసి పకపకనవ్వేస్తాడు ప్రభు.

"శారదా ! అమ్మా, కుంతల !"

గడపలకు లక్కపూస్తున్న కుంతల ఆ కంఠస్వరానికి విచలితఅయి ఖంగారుపడిపోతూ తండ్రికి ఎదురుగావెళ్ళింది.

"అమ్మ ఏదమ్మా?" నీరసంగా అన్న తండ్రిమాటలలో ఏదో ఉందని గ్రహించిన కుంతల నిలువెల్లా వణకిపోయింది.

"వసజక్క వస్తే, అమ్మ వసజక్కబస్తీకి చీరలకు వెళ్ళారుగా" ధైర్యం తెచ్చుకుంటూ అంది కుంతల.

"ఇంత సంకుచితబుద్ధి ఉందని తెలిసినా అతని గుణాన్ని చూసి ఇంతవరకు తెచ్చానమ్మా పరిస్థితులు." బాధతో కూడిన మాటలు తను పుట్టి పెరిగినతరువాత తండ్రినోటివెంట ప్రథమంగా విన్న కుంతల గిలగిలలాడి, తను ధైర్యంగాఉండకపోతే తండ్రి అసలువిషయం చెప్పరని సందేహించి,

"ఏమిటినాన్నా? ఏంజరిగింది?" అంది ధైర్యాన్నికూడ దీసుకుని.

"ఏం జరగనుండదో అదే జరిగిందమ్మా! నీ సుఖం కోసం ఏమైనా చేద్దామనుకున్నాను. కాని భగవానుడు ఇలా చేస్తాడనుకోలేదు. మొన్న కృష్ణయ్య వచ్చినప్పుడు మనకుకూడ లగ్నపత్రిక పంపించమన్నాడట. ఎదురుచూశారట. రాకపోయేసరికి, "వాళ్ళకు గర్వముంది, అహం ఉంది, ఉన్నవాళ్ళమని. మనకు ఇలాంటి సంబంధం వద్దంటూ కొడుకుకు ఉత్తరం వ్రాశాడట ఈరోజే. ఏం జరుగనున్నదో ఏమీ తెలియలేదు."

"అలా ఆయనకు చెప్పారా నాన్నా మొన్న వచ్చినప్పుడు"

"లేదమ్మా! చెపితే నేను పంపించనూ."

"ఏమిటి నాన్నా అయితే!" నిర్విణ్ణురాలై అంది కుంతల.

కోపాన్ని, బాధను దిగమ్రింగుకుంటూ జయరామ్,

"ఏమిటమ్మా! మనమేనా తక్కువ! ఇదిగాకపోతే ఇంకొకటి. ఎందుకమ్మా! హృదయంలేనివాళ్ళతో చెలగాటం ఆడేకంటే చెడ్డపేరువస్తే వస్తుంది. ఇంకో సంబంధం చూస్తేనే మంచిది. ఇంకా ఎక్కువ ఇస్తామని సంబంధాలు వస్తున్నాయని కూడ వ్రాశాడట కొడుకుకు. ఇప్పుడే రఘు అసలుగుణం బయటపడేది. ఇలాంటి విషమపరిస్థితులలోనే సజ్జనుడి అసలు రూపం బయటపడుతుంది. మనకు ముందుగానే తెలుస్తోంది, అదృష్టవంతులం" అన్నాడు.

"నాన్నా!" భయకంపితంగా పిలచిన కూతురిముఖం పరిశీలగా చూసిన జయరామ్ చకితుడయ్యాడు.

"మమ్మల్నను ఇలా పెంచి పెద్దచేసి మంచిచెడు విచక్షణాజ్ఞానాన్ని ఉగ్గుపాలతో పోసి ఇప్పుడిలా మీరే అనటం ఏం న్యాయం నాన్నా! చిన్నప్పటినుంచి కని పెంచిన తండ్రి మాట వినక, నెలనాడు పరిచయమైన మనమాటలు నమ్ముతారా? మామగారి ప్రవర్తనమీద కోపంవలన మీరలా అంటున్నారుగాని మీకు మాత్రం తెలియదా వారిహృదయం? మధ్యలో వారిని బాధపెట్టవద్దునాన్నా! అన్నంత తేలికగా మీరు మాత్రం వేరొక సంబంధం చూడగలరా? అవును! మీ వ్యక్తిత్వానికి అఘాతమే తగిలింది! అయినా ఏం చేయవలసినదీ ఆలోచించుదాం. వారితోపాటు మనమూ ఉద్రిక్తులమయితే మనం, మనఆదర్శాలు, మనమంచి ఎక్కడ నాన్నా?" ఉద్రేకంతో కూడిన విషాదంతో అంది కుంతల.

"కాదమ్మా! రఘు ఎలాంటివాడో ఇప్పుడు తెలుస్తుంది" భారంగా అన్నాడు జయరామ్.

"లేదు నాన్నా! నన్ను బాధ పెట్టవద్దు. ఎదురుచూచే సరికి చేయిదాటిపోతుంది." రుద్ధకంఠంతో అనలేక అన్నకూతురిని చూడగానే జయరాం హృదయం నీరయిపోయింది.

లేచెక్కిళ్ళు అదురుతూ కందిపోయి దుఃఖాన్నంతా దాచుకున్నట్లున్నాయి. క్రిందిపెదవి నొక్కి ఆపుకుంటున్న బాధతో కళ్ళువాల్చి పాదమును భూమికి వ్రాస్తూ శోకమూర్తి అయిన కుంతలను నిశితంగా చూసిన జయరామ్ మనస్సు మార్చుకున్నాడు. నాతల్లిని కష్టపెట్టి ఏంచేస్తే మాత్రం సుఖమేంవుంది. నాతల్లి సుఖమే సుఖం! నా ఆలోచనలు, నాబాధ

అంతా నాతల్లినిచూసి అయినా మార్చుకోవలసిందే, అనుకొని ఆర్ద్రతతో కూడిన ప్రేమతో,

"మరి ఏంచేద్దామమ్మా!" అన్నాడు జయరామ్ ఏమీ తోయక.

"మీరు ఢిల్లీ వెళ్ళండి నాన్నా! ఆ లెటరు మీరు వెళ్ళే టయిమ్‌కే వెడుతుంది. మీరు పరిస్థితులు విశదంగా తెలియ చేస్తే, వారు అపార్థంచేసుకొనుటకు తావుఉండదు" నిర్భయంగా ధైర్యంగా చెప్పిన కుంతలమాటలు యదార్థమే అనిపించాయి జయరామ్‌కు.

"ఇంతకంటె చేసేదిమాత్ర మేముంది. నీ సుఖంకంటె కావలసినది మాత్ర మేమిటి. అలాగేనమ్మా, వెళ్ళివస్తాను. అమ్మ లేదు......" బాధగా అన్నాడు జయరామ్.

"అమ్మ మీమాట కాదంటుందా నాన్నా! అమ్మ రాగానే చెప్పుతాను" అంటూ ప్రయాణపు ఏర్పాట్లుకు వెళ్ళింది కుంతల భారంగా అడుగు లేస్తూ. ఎంత సుఖపెడదామని అనుకొన్నానో అంతఎదురువచ్చిందే? భగవానుడి చిత్ర నాటిక కాకపోతే ఏమిటది? ఆదిలోనే తల్లిం . న్నిక. ఏం జరుగ నున్నదో అని ఆలోచనలో పడ్డాడు జయరామ్.

"ఇదిగో నాన్నా సూటుకేస్. ఇదిగో ఈ వేయి నూట్లకు ఇచ్చిరండి నాన్నా!"

"అలాగేనమ్మా! జాగ్రత్తగా ఉండు. వెళ్ళివస్తాను"

భారంగా వెళ్ళే తండ్రిని చూసిన కుంతలకళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

*     *     *

స్కూలునుండి వచ్చిన సమతకు, పెళ్ళిబట్టలు తెచ్చిన శారదాంబ, వనజలకు వాకిట్లోనే ఏమిటో శూన్యంగా కన్పించింది. గుండె ఝల్లుమంది శారదాంబకు; ఇల్లంతా కళకళలాడుతూ తిరుగుతూ పెద్దమ్మాయిగారూ అంటూ తిరిగే నౌకర్లకు సమాధానం చెప్తుతూ అజంతాశిల్పంలా అందాలు చిమ్ముతూ తిరిగే కుంతలజాడే తెలియటంలేదు. ఎప్పుడు చూస్తానా నాతల్లినంటూ వచ్చిన శారదాంబకు పిచ్చెక్కినట్లే అయింది. తెచ్చినవి అక్కడే ఉంచి ఇల్లంతా గాలించింది. పైన మేడమీద తనగదిలో నిదురపోతున్న కుంతలను చూసి ఆశ్చర్యంతోపాటు ఖంగారుపడిందికూడ శారదాంబ.

ఏం జరగనున్నదో ! నాన్న వెళ్ళేసరికి చేయిదాటిపోవచ్చు. నా అదృష్టమెలా ఉందో ననుకుంటూ, పుట్టినప్పటినుండీ బాధ తెలియకుండా పెరిగిన ముగ్ధబాల కుంతల సొమ్మసిల్లి సిదురాదేవిని శరణుజొచ్చింది. తల్లి చల్లనిచేయి పాలభాగంపై పడగా మెలుకువవచ్చి ఖంగారుగా లేచి తల్లిని చూసింది.

"ఈ పడకేమిటమ్మా ! జ్వరం తగిలిందా ? లేదే జ్వరం!" అంది గాబరాగా శారదాంబ.

ఖంగారుగా అడిగే అమ్మను బాధపెట్టటం యిష్టంలేక "ఏం లేదమ్మా ! ఖంగారుపడకు ఊరికే పడుకున్నా" అంది.

"ఊరికే ఎందుకు పడుకుంటావమ్మా ! తలనొప్పిగా ఉందా పనేమీ వేయకద్దమ్మా అంటే వినవు, పద చీరెలు చూద్దువుగాని" అంటూ శారదాంబ క్రిందికి వచ్చి "వనజా !

కుంతలకు అన్నీ చూపించు. నేను వంటచేస్తాను" అంటూ పురమాయించింది, బిడ్డకేమీ జరగలేదుకదా అని నిశ్చింతగా.

చీరలు పరధ్యానంగా చూస్తున్న కుంతలను తేరిపార చూచి అడిగింది వనజ.

"ఏమిటి కుంతలా అలా వున్నావు ?"

పిన్నినిచూసి కుంతల నిజం చెప్పేయాలనుకొని విషయమంతా చెప్పింది. సమత పరుగునవెళ్ళి తల్లితో అన్ని విషయాలు స్పష్టంగా చెప్పింది. శారదాంబ నీరైపోయింది. వనజ ఊరడించింది.

"నా జీవితం ఇలా ఉన్నా అక్కకూతురైనా సుఖపడుతుందనుకున్నాను. బాధపడకక్కా ! కుంతలకేమీ జరుగదు. అదృష్టవంతురాలు" అంటూ కన్నీరు తుడుచుకుంది వనజ.

# 14

సృష్టిలో మానవులందరూ ఒకటిగానే కన్పించినా వేరు వేరు దృక్పథాలతో జీవనరీతిని పొందుతూఉంటారు. ప్రసాద్ ఈవార్త వినగానే ఎంతో సంతోషించాడు. ఇలా జరుగుతుందని నాకు తెలుసు. భావన అంతా తనవలె ఉంటేనే మంచి అను

కుంటూ ఏదో వెతకాలని ప్రయత్నిస్తూఉంటాడు. నన్ను కాదని బయటకు వెళ్ళినందుకు, భేష్! చాలా బాగుంది. నవ్వుకుంటున్న తమ్ముడినిచూసి వనజ 'ఏమిట్రా నవ్వుతున్నావు?' అని అడిగింది. "పెద్ద ఆఫీసర్ కావాలట! కుంతల నాదైతే బయటిలా యిస్తారో?" వ్యంగ్యంగా అన్న తమ్ముడిమాటలకు తృళ్ళిపడింది వనజ.

"ఏమిట్రా నీ ఉద్దేశ్యం?" బిత్తరపోతూ అంది వనజ.

"బాగా శాస్తిజరిగింది అంటున్నా"

నొక్కి నొక్కి అన్న తమ్ముడి మాటలకు ఉగ్రరూపం దాల్చింది వనజ.

"ఇదట్రా నీవు ఆలోచించేది? నీ ముఖానికి ఆ బంగారాన్ని చ్చేది? సిగ్గు లేదూ! చదువుకోరా బుద్ధిగా అంటే ఏడాదికి నాలుగు నెలలు ఇక్కడే ఉండి గాలితిరుగుడు తిరుగుతూ చదువుతున్నానని అమ్మను మోసం చేస్తావు. రెండేళ్ళయినా పి. యు. సి. పూర్తికా లేదు? నీ బుద్ధులూ నీవు! నా జీవితం ఇలా అయిందికదా అని నీవైనా అమ్మను సుఖపెడతావనుకుంటే ఇలా చేస్తూ ఆస్తిఉందని గర్వపోతుగా వ్యవహరించుచు పెద్ద చిన్న లేక అహంకారికి నీకా కుంతలనిచ్చేది? ఇంతకు పదిరెట్లన్నా బావ నీదగ్గరకు రారు. నాతోనే ఆయన మనస్సిరిగిపోయింది. బాధగా ఆవేశంతో అన్న అక్క మాటలకు "ఓహో నీకు వివాహం చేసింది బావగారే కాబోలు! నాకు తెలియదుగా, చిన్నవాడిని." సిగరెట్టు కాలుస్తూ హేళనగా నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

"నీవు అదృష్టవంతుడివైతే కుంతలే భార్యఅయ్యేది. నీకు శని రేఖలు ఉండబట్టే బంగారంలాంటి మేనకోడలు లక్ష్మితో సహా బయటకు వెడుతోంది. ఇప్పుడైనా బుద్ధితెచ్చుకొని ఆ సిగరెట్లు, చెడుఅలవాట్లు మాని బుద్ధిగా చదువుకో." మందలిస్తూ విరక్తిగా లేచివెళ్ళిపోయింది వనజ.

కొంటెగా నవ్వుకున్నాడు దుర్వ్యసనాలోలుడు ప్రసాద్. అయినా కుంతలను తలుచుకుంటే భయంగాఉంది ప్రసాద్‌కు, ఏక్షణంలో పరాయిదవుతుందోనని. తనంటే ప్రేమగా పలుకరించే కుంతల తనకు కాకుండా పోతుందా, పోదు. భ్రమపడుతూ నగ్నసత్యాన్ని తన కళ్ళతో చూడలేక ఆ వూహ వచ్చినప్పుడల్లా తనను మోసంచేసుకుంటూ అహంభావంతో తిరుగుతున్నాడు ప్రసాద్. కావలసినంత స్వేచ్ఛగా ఖర్చుపెడుతూ వంటరిగా తిరిగే లక్ష్మీపుత్రుడు అచంచలుడైనపుడు చెడుస్నేహాలు కొదువెందుకవుతాయి ? ఊళ్లో పనిలేక తిరిగే యువకులంతా దాదాపు ఈ స్థితిలో జులాయిగా తిరిగేవారే ఎక్కువయ్యారు ఆ పాలెంలో. అందులో లక్ష్మీపుత్రుడు ప్రసాద్ వీరిలో మెంబరయినపుడు కొదువేముంది ? చందాలకుగాని, ఊరిక్షేమంతాలూకు సంప్రదింపులకుగాని వచ్చిన పెద్దమనుష్యులను హేళనచేయటం వీరికి సరదా. పంచాయితీ ప్రెసిడెంటు భాస్కరరావు ఠీవిగా కూర్చుని సిగరెట్టు కాలుస్తున్న ప్రసాద్‌నుచూసి గతుక్కుమన్నాడు. బావ ఊళ్లో అంత పేరుపొందిన మంచివాడనిపించుకొని ఇతరులకు మార్గదర్శకుడుగా ఉంటే బావమరిది ఇలా తయారయ్యాడా ? సిగరెట్లు

(త్రాగేవాళ్ళు జయరామ్ ఇంటిముందు కాల్చిపారవేసి లోప లికివచ్చి మాట్లాడటం అలవాటు. చెడేవారికి ఎన్నిబుద్ధులైనా ఎలా చెవికెక్కుతాయి. అయినా కదిలించి చూద్దాము హాస్పి టలుకు ఏమైనా సహాయం చేస్తాడేమోనని పలుకరించాడు.

"ప్రసాద్! ఊళ్లో డాక్టరులేక అందరూ ఎన్నో ఇబ్బం దులకు లోనవుతున్నారు. నీవు పూనుకుంటె నీపేరు చెప్పు కొని అందరూ సుఖంగా బ్రతుకుతారు. యువకుడవు, ఉత్సాహ వంతుడివి!" పొగుడుతూ అన్నాడు లౌకికుడు భాస్కరరావు.

"డాక్టరా? మందులా? ఈ వూరికి! పంటచేలల్లో ధాన్యం కూరగాయలు, పుల్లలు బ్రతకనివ్వకుండా కొట్టుకుపోయే ఈ జనానికి డాక్టరా? సరిగా తిరగలేరని డాక్టరును తీసుకువచ్చి మందులిప్పిస్తా...!"

వ్యంగ్యంగా అన్న ప్రసాద్ మాటలకు నవ్వుతూ అన్నాడు భాస్కరరావు.

"ఎక్కువ బీదతరగతి జనం ఉండుటవలనజరుగుతోందది. అది మన జాగ్రత్తలో మనం వుండి మనంగూడ వారిని ఒక కంట కనిపెడితే వారూ మనను గౌరవంగా చూస్తారు."

"నాకేమీ గౌరవం అవసరంలేదండీ! మీరంతా ఉన్నారుగా గౌరవనీయులు." దుడుకుగా అన్న మాటలకు భాస్కరరావు నొచ్చుకొని, "నీవు డాక్టరుకోర్సు చదువకూ డదూ, వృద్ధిలోకి వస్తావు!" నచ్చచెప్పేధోరణిలో అన్నాడు.

"నచ్చినవాళ్ళందరూ చాలు. నా కవసరం లేదు."

విసుకుగా లేచిపోయిన ప్రసాద్ ప్రవర్తనను చూసి అనుభవజ్ఞుడైన భాస్కరరావు నవ్వుకున్నాడు జాలిగా.

# 15

వేయికళ్ళతో జయరామ్‌కోరకు ఎదురుచూస్తున్నారు. కుంతల మనస్సు మనస్సులో లేదు. అన్ని వివరాలతో భయంభయంగా రఘుకు తెలియపరుస్తూ లెటరు వ్రాసింది. శారదాంబ భగవానుడిపై భారంమోపి దిగులుపడుతూ కూర్చుంది;

"అక్కా! నాన్న ఈరోజు వస్తారు" ఇంట్లో నిశ్శబ్దం క్రొత్తగా తోచి బాధపడుతున్న సమత అంది అక్కను మాట్లాడించాలని.

"ఎలా వస్తారమ్మా! నాలుగురోజులేగా. రేపు వస్తారు"

"కాదు ఈరోజే" రెట్టిస్తూ అంది సమత.

"నీ కీ కష్టం ఆదిలోనే వస్తుంది అనుకోలేదమ్మా! ఎంతో సుఖపెట్టాలని కలలుగన్నాను." శారదాంబ కన్నీరు తుడుచుకుంది,

"ఏమయిందమ్మా ఇప్పుడు !" తల్లి బాధకు తల్లడిల్లిన కుంతల ధైర్యం చెపుతూ అంది.

"నేను కాపురానికి వచ్చినతరువాత నాన్నమాట లోపంకావటం ఇదే తొలిసారమ్మా ! తన పొరపాటులేకుండా వాళ్ళకాళ్ళదగ్గరకు వెళ్ళటంకూడా ఇదే తొలిసారి. ప్రాణంతో సమానంగా పెంచుకున్న నిన్ను సుఖపెట్టాలనే ఈ పనిచేసి ఉంటారు.''

"అమ్మా అన్నాయికి అన్నివిషయాలతో లెటరు వ్రాశాను" మాట మార్చాలని అంది సమత. "వాడికెందుకు వ్రాశావే! వాడు బెంగపెట్టుకుంటాడు. ఈ రోజుకు వాడి భవిష్యత్తు వాడంతట వాడే కాపాడుకుంటున్నాడు. ఇలాచేయుట తప్పనాన్నా అని చెప్పించుకోలేదు. పేరుతెచ్చుకుంటూ అందరికీ ప్రేమపాత్రుడయ్యాడు. డాక్టర్ సీటు వస్తుందోరాదో వాడికి" కొడుకును మెచ్చుకొంటూ అన్న అమ్మమాటలకు సమత అమ్మను నవ్వించాలని,

"వాడి నలా పొగిడితే నే నసలు చదువను. నేను చదువటం లేదా? నన్ను పొగడవే?" కుంతల, శారదాంబ ఫక్కున నవ్వి అంతలోనే ఉదాసీనులయ్యారు.

రెండురోజులు రెండుయుగాలైనాయి కుంతల, శారదాంబలకు. వారానికి వచ్చాడు జయరామ్. వస్తూనే నవ్వుతూ వచ్చి కుంతలనుపిలచి రఘుయిచ్చిన కానుకలిస్తూ,

"అనుకున్నంత ఆపదలేదమ్మా! అదృష్టవంతురాలవు!"

"హమ్మయ్య" భారము, దిగులు వదలి తృప్తిగా నిట్టూర్చిన కుంతల ముఖారవిందం చూసి నవ్వుతున్నాడు సంతృప్తిగా జయరామ్ ప్రయాణబడలిక మరచి.

"ఏమయిందండీ" ఆదుర్దాగా వచ్చింది శారదాంబ.

"నీకు చెప్పను. నా తల్లికే చెప్తాను."

"అవునులే! కూతురికోరకేగా చేయరాని పనికూడ చేశారు. నా కెందుకుచెప్తారులే" దూరంగా కూర్చుంది నవ్వుతూ శారదాంబ.

"మంచినీళ్ళు కావాలా నాన్నా! ఇవి తీసుకోండి అమ్మ చేసింది!" అంటూ ప్రేమతో తండ్రికి టిఫిన్ అందించింది.

"చూడు శారదా! నీవు మంచినీళ్ళన్నా అడిగావా? అయినా క్రొత్తేముంది. నాతల్లి లేకపోతే నేనెప్పుడో మాడిపోయేవాడిని"

"రేపు పెళ్ళినతరువాత కూతురి వెంట వెడుదురుగానిలే. విషయం చెప్పండి ముందు" ఆదుర్దాగా అంది శారదాంబ.

"ఏముంది? మన తల్లి అదృష్టవంతురాలు. నేనూ, వాళ్ళనాన్న లెటరూ ఒకటేసారే ఒకగంట అటూఇటూగా చేరాము. విషయం అర్థం చేసుకొని రఘు పకపకనవ్వి మీ పెద్దవారికెందుకిన్ని అనుమానాలువస్తాయి? ఇంత చిన్నవిషయాని కింత ఖంగారా! నాన్న మనస్సు ఎప్పుడూ అంతే! అన్నీ తెలిసిన మీరెలా పొరపడ్డారు నావిషయంలో. ఎన్ని జన్మల

నోముఫలమో కుంతల నాకు అర్ధాంగి అగుట. ఇంత బంగారు గనిని వదలి ఎక్కడికిపోతానండీ నేను" అంటూ తన టేబుల్ పై పెట్టుకున్న కుంతలఫొటోవైపు చూశాడు అని చెప్పుతూ జయరామ్ కుంతలవైపు చూడబోయేసరికి కుంతల సిగ్గుతో పారిపోయింది.

"స్నేహితులంతా తననెంతో అదృష్టవంతుడని మెచ్చు కుంటున్నారట. కుంతలను ఎప్పుడు చూస్తానా అని తహతహ లాడుతున్న నన్ను ఇలా ఎందుకు అనుమానించారండీ? నాన్న అంటే పెద్దవారుగనుక ఏవో ఉద్దేశ్యాలు పెట్టుకుంటారు. ఎక్కడో మాటలలో పొరపాటు జరిగిఉంటుంది" అంటూ ఎంతో గౌరవంగా, సౌమ్యంగా మాట్లాడుతూఉంటే నాకళ్ళు ఆనందంతో చెమర్చాయి, ప్రాణంకంటె మిన్నగా పెంచు కున్న మనతల్లికి తగినవరుడు లభ్యమయ్యాడని."

భర్తమాటలు వింటూ తన్మయురాలైంది శారదాంబ. సమతహృదయంలో బావ ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించు కున్నాడు.

* * *

అల్లుడి ఆదేశప్రకారం కృష్ణయ్యదగ్గరకు సంతోషంగా వెళ్ళి, ఎక్కడో పొరపాటు జరిగివుంటుందని వినయంగా తెలియచెప్పి వియ్యంకుడికి సంతృప్తి కలిగించాడు జయరామ్. కొందరువ్యక్తులు తమకంటె ఇతరులు ప్రత్యేకంగా పేరుప్రతి ష్టలు తెచ్చుకున్నప్పుడు తమకు తెలియకుండానే ఈర్ష్యపడు

తుంటారు. వారు తమదగ్గరకు వచ్చి మాట్లాడి క్షమార్పణ కోరుకోవాలని తహతహలాడతారు. అలాగే కృష్ణయ్య తన ఆధిక్యతను నిరూపించుకున్నాడు.

## 16

జయరామ్ మేడ విద్యుద్దీపాలతో కళకళలాడుతోంది. పచ్చితాటాకువాసనలు పెద్దలకు ఏవో మధురభావాలను తలపుకు తెస్తున్నాయి. పిల్లలు కేరింతలుకొడుతూ ఆడుతున్నారు.

నవవధువు కుంతల పెండ్లికుమార్తెగా మెరిసిపోతూ చూపరులకు మిరిమిట్లుగొలుపుతోంది. ఆడబడుచు, అత్తగార్ల హాస్యధోరణికి, స్నేహితుల ఛలోక్తులకు, కుంతలకు ఊపిరి సలుపుట లేదు.

వివాహవేదికకు నిండుగా అతిలోకసౌందర్యమూర్తుల్లా ఉన్న నవదంపతులను హృదయపూర్వకంగా దీవించి అక్షంతలు చల్లారు పెద్దలు. ఫ్రెండ్స్ శుభాకాంక్షల్లో, కొంటెచూపులతో కుంతలను మైమరచి చూస్తూనే రఘుహృదయం పులకరించిపోతుంది. మల్లెలవాసనలు ముద్దుకలిస్తుంటే పట్టుచీరల మొత్త

దనంలో, యువదంపతుల సోయగాలను చూస్తున్న అతిథులు, ముత్తయిదువులు మురిసిపోయారు.

ముద్దులొలికిస్తూ, ముగ్ధగా జలతారుముంజేతులతో ప్రేమరసాన్నంతానింపి మల్లెదండనిండుగా భర్తకువేసి తన్మయత్వంతో కళ్లుమూసుకుంది ఒకక్షణం కుంతల.

కన్యాదానంచేసి అప్పగింతలుపెట్టే భారతీయ ఆడపిల్ల తలిదండ్రులు పడేబాధకు వేయిరెట్లు బాధననుభవించారు శారదాంబ, జయరామ్‌లు. అందరూ ఆ సమయం కన్నీటితో కుంతలకు వీడ్కోలిచ్చారు అతిప్రేమతో.

ఇల్లంతా శూన్యంగా తోచింది. ఎక్కడివక్కడే ఉంచి శూన్యంలోనికి చూస్తున్న కూతురిని, అల్లుడినిచూసి శీతారామమ్మ హృదయం ద్రవించింది. తన బాధనుకూడా చెప్పుకుంది ఆవేదనతో,

"శారదా! ప్రసాదేమిచేశాడో చూశావా! పోసీలే ముత్యంలా పెంచుకున్న బిడ్డని మీకిష్టంలేనిదే ఎందుకులే నేనడుగుటని కుదుటపరచుకున్నాను" దుఃఖంతో పూడుకుపోయినవి మాటలు శీతారామమ్మకు.

"ప్రసాద్ ఏం చేశాడమ్మా?" సంక్షిప్తంగా అంది శారదాంబ.

లక్ష్మీదేవతలా నవవధువు నిండుగా మామయ్యను పిలవటానికి వచ్చిందిగా రాత్రి కుంతల. కుంతలను చూడగానే కన్నీళ్ళు కారుస్తూ,

"వెళ్లు ! ఆఫీసరు కావాలన్నావుగా, పోనీలే నీవు సుఖంగా ఉండు" అంటూ దానిని కసిరికొట్టాడు. అది బిత్తర పోయి నావైపు చూసింది.

"అది ప్రేమతో చెప్పటానికివస్తే ఎందుకురా అలా కసురుకుంటావని" అన్నాను కోప్పడుతూ.

"నీకేం తెలుసమ్మా ! నాబాధ. కుంతల నాదే సను కున్నాను. ఇంతవరకు వస్తుందని నేను వూహించలేదు. పోనీలే అది సుఖపడితే చాలు" అంటూ వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. నాకూ, కుంతలకుకూడా కన్నీళ్లుకారాయి. నాతల్లి ఒక్క మాటకూడా మాట్లాడలేదు.

"పెళ్ళికి రా ! మామయ్యా అంతామరచిపో" అంటూ వెనుదిరిగింది. పిడిమనస్సులో ఈ భావం ఇంతగా ఉందని అను కోలేదే నేను" అంటూ కన్నీరు తుడుచుకుంది శీతారావమ్మ.

జయరామ్ శారదాంబలు స్తబ్ధులయ్యారు.

"వాడి ప్రవర్తన సరిగాలేదమ్మా. వాడిని కాస్త కని పెట్టుకొని ఉండు. పిచ్చివాడవుతున్నాడు". శారదాంబ తమ్ముడిపట్ల జాలితో కన్నీరుకార్చింది.

"నాతల్లికి శుభమా అని పెళ్ళిజరిగితే ఈ కన్నీళ్ళే మిటి ?" విసుక్కున్నాడు జయరామ్.

* * *

మెరిసేకంఠంలో నల్లపూసలు నిగనిగలాడుతూ ఉంటే, పెళ్ళికూతురి సిగ్గుదొంతరలు తళతళలు మాసిపోకముందే తిరిగి

వచ్చిన అల్లుడిని కూతురిని సందుగా ఆహ్వానించారు శార దాంబ జయరామ్ సంతోషంగా. సమత బావను ప్రతి విష యంలోనూ ఎగతాళిచేస్తూ తన మనుసుతనాన్ని స్పష్టీకరించు తోంది.

"బావా ! బావా !"

"ఏమిటమ్మా ?" ప్రేమ వాత్సల్యంనిండిన బావమాటలు సమతకెంతో హాయినిస్తాయి.

"స్నానం చేయాలి"

"ఏమిటి విశేషం ? పసుపుముద్దలు పెట్టావా ?"

"లేదు బావా ! చక్కటి కాశ్మీర్ సిల్కుచీర పెట్టాను. త్వరగా స్నానంచేసి కట్టుకోవాలి"

"అయితే నా సూట్ నీవేసుకుంటే తప్పక నేను చీర కట్టుకుంటా"

"ఈ పెంకిదానికి మీరే చెప్పాలి సమాధానం !"

"నేను వెళ్ళివస్తాను బావా, పరీక్షలు దగ్గరలో ఉన్నాయి"

"బాగా చదువు మరి ! మీ నాన్నగారికి నిన్ను డాక్టరు చేయాలని ఉంది" బావమరిదితో నవ్వుతూ అన్నాడు రఘు.

"మీకు లేదా బావా ?" కొంటెగా అడిగింది సమత. రఘు వెలవెలబోయాడు. మల్లిక్ సమతవైపు ఉరిమి చూశాడు.

"బాసతో చెప్పావా ? పది టైమ్ అయిపోయింది" తండ్రిపిలుపు విని మల్లిక్ వెళ్ళిపోయాడు.

"కోపమొచ్చిందా బావా? కోపం పోయేందుకు ఏం చేయాలి ? ఆ ! తెలిసిందిలే, అక్కను తీసుకొస్తానుండండి" అంటూ పరిగెత్తిన కొంటెమరదల్ని చూసి రఘు హాయిగా నవ్వుకున్నాడు.

## 17

"శారదా !"

పరధ్యానంగా ఉన్న శారద తృళ్ళిపడింది.

"ఎందుకంత ఖంగారు ? అమ్మ ఇపుడే వెళ్ళదులే. తీసుకువెళ్ళే సూచనలు లేవిప్పుడు. బెంగపడకు."

"ఎందుకండీ బెంగ. దానికాపురం అది ఇంకెంత బాగా చేసుకుంటుందో చూడాలని ఉబలాటంగా ఉందండీ ! కాక పోతే అది వెడితే ఇంటికళ ఏమవుతుందోనని తప్ప..."

"ఇప్పుడు నాకొక ఆలోచనతోచింది. నీ ఉద్దేశ్య మేమిటి ?"

భర్త ఏదో విషయాన్ని మంచా చెడా అని తర్కించుకుంటున్నారనీ, అందుకే ఇలా అడగబోతున్నారని గ్రహించిన శారదాంబ,

"ఏమిటో చెప్పండి ! నేనూ సంతోషిస్తాను."

"నీవు సంతోషించవు"

"మీకు సంతోషాన్నిచ్చేది నాకు కాదా ?"

"కుంతలా రఘులను హనీమూన్‌కు కాశ్మీరు పంపించాలని ఉంది."

"అదేమిటండీ ! నిండుగా సందడిగా ఉన్న నాలుగు రోజులూ కళ్ళముందుండక కాశ్మీరమా ? అంత దూరమెందుకండీ ?"

నేను ముందే చెప్పానుగా ! నీకు సంతోషం కల్గించదని. చూడు శారదా ! నాకెన్నో కోరికలుండేవి. కాని నా జీవనపథం మరోత్రోవకు నడిచింది. కోరినవరుడు లభ్యమైన మనతల్లి, గుణవంతుడయిన అల్లుడి సంతోషంకంటె మనకు కావలసిందేమిటి ? హాయిగా సరదాగా తిరిగివస్తారు. ముందు ముందు పిల్లలుకలిగితే వెళ్ళగలరా ? ఈ కోరికకు అభ్యంతరం చెప్పకు శారదా !"— పండువెన్నెల వెదజల్లే చంద్రికాకాంతుడిని చూస్తూ అన్నాడు జయరామ్.

"మీ కోరిక నేను కాదంటానా ! సుఖము మరచి బిడ్డలకొరకు, వారి ఆనందంకొరకు ప్రతినిముషం మీరు పడే వేదన తెలిసి నేనెలా కాదంటానండీ ?" ప్రేమగా అంది శారదాంబ.

మేడమీదనుండి దిగివచ్చిన కుంతల ముందుగా తండ్రికెదురుగా వచ్చినందుకు సిగ్గుపడుతూ తప్పుకొనుటకు ప్రయత్నించింది.

జయరామ్ గ్రహించి పరిశీలనగా చూసి,

"ఎందుకమ్మా సిగ్గుపడతావు. శారదా ! చూడు వెన్న ముద్దలా పెంచుకున్న తల్లిముఖం, ఎలా కందిపోయిందో !" చిరు కోపంతో అన్నాడు జయరామ్.

"అది అసలే సిగ్గుపడుతూఉంటే మీరు మరీను." భర్తను మందలించింది శారదాంబ.

"అమ్మా ! కుంతలా ! నీకొక శుభవార్త. మిమ్మల్ని హనీమూన్ కాశ్మీరు పంపించాలని ఉంది." మెరిసే కళ్ళతో అన్నాడు జయరామ్.

వేయిమల్లెలు ఒక్కసారిగా తనమీద గుమ్మరిల్లినట్లు వికసించింది కుంతల ముఖం. పరుగున వాలింది భర్త చేరువలో.

మత్తులోనే ఉండి రఘు చాపినచేతులలో వాలి,

"మీకొక శుభవార్త" అంది కుంతల.

"నాకంతా శుభమే ! వేరే వార్త ఏమిటి ?

"మనం కాశ్మీరు ప్రయాణం !"

"ఆ ! కాశ్మీరా ? నాకు శలవు ఎక్కువ లేదు మరి!"-ఉత్సాహంపోయి దిగులుగా అన్నాడు రఘు.

"త్వరగా తిరిగివచ్చేద్దాము. హాయిగా కాశ్మీరులో తిరుగుతుంటే..."

తన్మయంతో అన్న కుంతలపై ముద్దులవర్షం కురిపించి, "ఇంతకంటె హాయిగా ఉంటుందా లిల్లీ !" అన్నాడు రఘు.

"నాకేమిటో ఇద్దరం కలిసి ఎక్కడెక్కడికో తిరగాల ఉందండి."

"అదిగో అండి గిండి అన్నావంటే ఊరుకునేది లేదు. పేరు పెట్టి పిలువవలసిందే."

కుంతల సిగ్గుపడుతూ చేతిలో తన అమృత అధరాలను ఉంచి "రఘుజీ" అంది కొంటెగా.

"ఉత్తరాలలో 'రఘూజీ'లతో నింపి సంపేదానవి, ఇలా సిగ్గుపడతావెందుకు?"

తన బలమైనచేతులతో నాజూకైన కుంతలనడుమును బంధించాడు రఘు తన్మయత్వంతో.

* * *

శ్రీనగర్ చేరిన నవదంపతుల్లో ఉత్సాహం సుమధుర ప్రఫుల్లకాంతులతో కేరింతలు కొడుతోంది. శంకరాచార్య, హారిపర్బాత్ మహోన్నత హిమాలయ శిఖరాలమధ్య శ్రీనగర్ పార్శ్వమున ఉన్న జీలంనది నవజ్యోత్స్న కాంతులతో మణిమయంగా భాసిస్తోంది. చీనార్ చెట్లమధ్యగా శ్రీనగర్ రోడ్డుమీద ప్రయాణంచేస్తుంటే రఘు, కుంతల స్వర్గలోకంలో విహరిస్తున్నామా అన్న అనుభూతికి లోనయ్యారు. డాల్ సరస్సు, మొగల్ గార్డెన్సు, బోటు షికార్లులో మైమరచిపోయారు. దంపతులు హావంతీపూర్‌లోని బుద్ధుని శిల్పాలు, మార్తాండశిథిలాలు, అమరనాథ్‌గుహ సవిస్తరంగా తెలియచెపుతూ కుంతలకు చూపించాడు రఘు. రెడ్‌స్టార్సు, బుల్‌బుల్‌పిట్టల మధురధ్వని, కుంతలను గిలిగింతలు పెట్టాయి. రాయల్‌స్ప్రింగ్ అనే గార్డెనునుండి డాల్‌సరస్సు, నిసేహాత్ కను మనోహరంగా జగత్తును మైమరపిస్తున్నాయి. ప్రక్కన

మత్తుకలిగించే ప్రియుడి ఆలింగనలో పరవశమై మత్తుతో ఊగిసలాడే కుంతలవలె లిల్లీ, రోజా, డాఫోడిల్స్‌లు అల్లల్లాడు తున్నాయి మధువనమైన మొగల్ గార్డెన్స్‌లో.

సుమధుర ప్రశాంత ప్రకృతి సౌందర్యశోభలలో దోగాడి అలసి సొమ్మసిలి, ఇంటిదారిపట్టిన రఘు, కుంతలను చూచే ప్రయాణీకులు మరొకసారి చూస్తే బాగుంటుందనే తీపి భావాన్ని కనబరిచారు.

కాశ్మీరీ కుంకుమపువ్వును చెక్కిళ్ళకు పులుముకొచ్చి నట్లున్న కుంతల రోజా మెరుపులు మరొకసారి రఘును మైమర పించాయి. ఏదో స్వర్గంలో అనుభవించి తిరిగివస్తున్నామా అన్న దిగులు ఆవరించింది కుంతల హృదయాన్ని.

తిరిగివచ్చి అలసిసొలసిన గారాబుపట్టిని కన్నులారా చూసి మురిసిపోయారు శారదాంబ జయరామ్.

"అక్కా నాకేం తెచ్చావు ?"

"ఎంబ్రాయిడరీలో కాశ్మీర్‌నే చెప్పుకోవాలి సమతా ! ఇదిగో ఈచీర చూడు. ఇదే నీకు తెచ్చింది." ప్రేమతో ఇచ్చింది చెల్లికి.

"అబ్బ ఎంత బాగుంది" మురిసిపోయింది సమత.

"ఎందుకమ్మా అవన్నీ ! మిమ్మల్ని వాడుకోమని ఇస్తే ఇలా ఖర్చుచేశారా ?"— తెచ్చినకానుకలు అమ్మకు, నాన్నకు కూడా ప్రేమాసిందించిన కానుకలతో ఇస్తున్న కూతుర్నిమైపు వాత్సల్యంతో చూస్తూ అన్నాడు జయరామ్.

# 18

కొడుకు కాశ్మీరు వెళ్ళినట్లు తెలుసుకున్న కృష్ణయ్య హృదయం మరొక్కసారి భగ్గుమండింది. నాకే కదా డబ్బు ఉందని అహంకారపోతే ఏమిటిది ? నాతో పని లేదా ఈ మామా అల్లుళ్ళకు ! హుంకరించాడు కృష్ణయ్య. సౌందర్య రాశి కోడలు తన కన్నబిడ్డను దూరం చేస్తుందేమోనని బాధ పడింది రఘుతల్లి కమలమ్మ.

వెంటనే కాశ్మీరునుండి రాగానే మా అబ్బాయిని పంపించండి అంటూ లెటరువ్రాసి మనిషినిచ్చి పంపాడు కృష్ణయ్య. కాని జయరామ్ యువజంటను విడదీయలేక తిరిగివచ్చిన అల్లుడితో ఎలాచెప్పాలా అని బాధపడుతున్నాడు. ఆరోజు కుంతల సంపెంగలు, గులాబీలతో దండగ్రుచ్చి నిండుగా అమర్చుకొని సంపెంగరంగుచీరె ధరించి, మెడలో ముత్యాలదండ పురివిప్పినట్లు మెరుస్తూ ఉంటే భర్తకు అవసర మైనవి సర్దుతూ కళకళలాడే సౌందర్యంతో ఇల్లంతా తిరు గుతూ, తను కాశ్మీరులో చూసినవింతలు విశేషాలు చెపుతూ ఉంది. మాటలు విన్పించి ఒక్కసారి తృళ్ళిపడింది' తండ్రి, భర్త సంభాషించుకుంటున్నారు.

"ఎల్లుండి వెళ్ళిపోవాలండీ" జయరామ్‌కు చెప్పక తప్పలేదు.

"నాన్నగారు లెటరువ్రాసి పంపారు మిమ్మల్ను ముందు గానే పమ్మనమని," చెప్పలేక చెప్పాడు జయరామ్.

కలత చెందినట్లు రఘును గుర్తించాడు జయరామ్. మాట మార్చాలని,

"తిరిగి మరల ఎప్పుడు ?"

"ఈసారి శలవలు త్వరగా లేవండీ ! నాలుగు నెలలు పడు తుంది"— దిగులుగా అన్నాడు రఘు.

కుంతలహృదయం బాధతో కంపించింది. నాలుగు నెలలా ! ఉహూ ! నేనుండ లేను. వారిని వదలి నేనెలా ఉండ గలను — ఆ వేదన కుంతలను వశపరచుకుంది. మేడమీదకు వెతుక్కుంటూవచ్చిన రఘు కుంతల ఏడుస్తున్నట్లు గమనించి ఖంగారుపడ్డాడు.

"ఏమిటి లిల్లీ ! ఏం జరిగింది ?" ఆదుర్దాగా అడిగాడు కుంతలను దగ్గరకు తీసుకుంటూ.

"నేనూ వస్తాను" నిశ్చయంగా నిబ్బరంగా అంది ఏమీ తెలియనట్లు పారిపోతున్న కృష్ణ కేసి చూస్తూ.

మాటలన్నీ విన్నదని గ్రహించాడు రఘు. "నాకు మాత్రం ఒంటరిగా వెళ్లాలనిఉందా లిల్లీ ! ఇప్పుడు నాకిచ్చే స్టైయిఫండ్ నీకు తెలియనిది కాదు మన సంసారం ఎలా గడు స్తుంది. ఇంకో సంవత్సరం ఓపికపడితే పెద్దఉద్యోగం వస్తుంది. లేదా మన అదృష్టముంటే విదేశాలకు పోవచ్చు, ఇలా పేచీ పెడితే ఎలా చెప్పు !" మృదువుగా కుంతల చిను గెడ్డము స్పృశించి తనవైపుకు త్రిప్పుతున్నాడు రఘు.

"ఎలా వదిలి ఉండాలి?" దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ అంది కుంతల.

"తప్పు, ఇలా ఏడుస్తారా ఎక్కడైనా !"

"ఏమో నా కేమిటో భయంగా ఉంటోంది, మీరు లేని నా ఒంటరితనం తలుచుకుంటే"— కుంతల భర్త గుండెల్లో తలదాచుకుంటూ అంది.

"అలాగే ఉంటుంది, తరువాత అలవాటవుతుంది. సరే ఇది విన్నావా ? నాన్నగారు వెంటనే రమ్మని వ్రాశారట. వెళ్ళకపోతే నిన్నే అంటారు - కోడలు, కొడుకును దూరం చేసిందని. నీ అందం, నీ సౌజన్యం అపార్థాలకు దారితీస్తుంది లిల్లీ ! మరి నన్ను పంపించవూ !"

యదార్థంగానే తోచాయి భర్తమాటలు. సంతోష విచారాలతో సాగనంపింది కుంతల భర్తను.

"ఏమిటమ్మా ! మమ్మలను మరచిపోయావా ?" పంకజ నవ్వుతూనే అడిగింది అక్కకూతురిని.

కుంతల నిజంగానే తను అందరినీ మరచినట్లు తెలుసుకుంది. అమ్మ ఏం చేస్తుందో ! తను ప్రతినిముషమూ తన దగ్గర లేకపోతే బాధపడే అమ్మ, ఇప్పటికి ఇరవై రోజులయింది అమ్మతో ప్రశాంతంగా మాట్లాడి. చెల్లి, నాన్న తననుచూసి ఎంత నవ్వుకుంటున్నారో ! సిగ్గుతో కుంచించుకుపోయి తన వైపే చూస్తున్న అమ్మ, నాన్నలవైపు జాలిగా చూసింది కుంతల.

"ఎందుకమ్మా సిగ్గుపడటం ! నీవు అదృష్టవంతురాలవు గనుకే ఈ తలిదండ్రులకు పుట్టావు. అలాంటి భర్త లభ్యమయ్యాడు."— పంకజ మెరిసేకళ్ళతో అంది.

"మల్లికొకు డాక్టర్ సీటు వచ్చిందమ్మా! సమత పి. యు. సి. కి వెడుతోంది"— సంతోషంతో చెప్పాడు జయ రామ్ కుంతలకు.

# 19

ఆచారంగా కోడలిని తీసుకువెళ్ళారు రఘు తలి దండ్రులు. పంపలేక పంపారు శారదాంబ, జయరామ్.

రఘు అదృష్టవంతుడని మురిసిపోయారు ఇరుగుపొరుగు కమలమ్మ కోడలిని చూసి. కృష్ణయ్య, కమలమ్మ, ఆడపడుచు అందరూ విస్తుపోయారు. అహం, గర్వం, డాబుసరులతో కొడు కును వలలోవేసుకొని అతి నిర్లక్ష్యంగా ఉంటుందనుకున్న సౌందర్యరాశి కోడలు అందుకు వ్యతిరేకంగా కనిపించి ముగ్ధు లను గావించింది. వినయం, సౌజన్యం, గంభీరతతో కూడిన ఉదారత, శుచిశుభ్రతలతో లక్ష్మీప్రసన్నమైన కోడలను చూసి ఆనందపరవశు లయ్యారు.

"వదినా! వదినా! నీవు బాగా పాడతావట! ఒక్క పాట పాడవూ! మా సునీత చిన్నప్పుడు పాడేది"— అంటూ

పరధ్యాన్నంలో మునిగిపోయిన ఆడపడుచు మంజరిని నిశితంగా చూసింది కుంతల.

"ఏమిటమ్మా ఆ పరధ్యానం ? సునీత ఎవరు ?"

"మేనత్తగారి అమ్మాయి వదినా. నా చిన్నతనంలో చూశాను. అప్పుడే ఎంతో స్నేహశీలిగా ఆప్యాయంగా ఉండేది. చాలా బాగా పాడేది. బొమ్మలాటలు ఆడుకుంటూ మైమరచిపోయేవాళ్ళం. కాని నాన్న, అత్తయ్య, ఏదో అత్తయ్య కివ్వవలసిన డబ్బుతాలూకు ఘర్షణపడ్డారు. ఆరోజు నా కింకా బాగా గుర్తుంది. అత్తయ్య ఆత్మాభిమానం గలది. నాన్న దూషణ పలుకులు విన్న వెంటనే, నాతో ఆడుకుంటున్న సునీతను తీసుకొని మావయ్యతో కన్నీరు కారుస్తూ వెళ్ళి పోయింది. అంతే. అప్పటినుండి మాకు, అత్తయ్యగారికి రాక పోకలు ఆగిపోయాయి. తరువాత మావయ్య పోయినట్లు తెలి సింది. అయినా నాన్నకఠినహృదయం ద్రవించలేదు. అత్తయ్య అదృష్టమో, సునీత అదృష్టమో కాని ఇన్సూరుచేసిన మావ య్యకు లక్షరూపాయలు వచ్చాయట. ఇప్పుడు ఆ లక్షతో అత్తయ్య తన తెలివితేటలతో దాదాపు మూడు లక్షల ఆస్తి పెంచిందట. సునీత ఎక్కడో కాన్వెంటులో చదువుతోందట.

గతస్మృతులు లీలగా కన్పిస్తూవుంటే మంజరి వదినతో సునీతను తలచుకొని చెప్పింది బాధగా. కుంతలకు సునీతపై జాలికలిగింది తండ్రిలేని అనాథ అయినందుకు.

"సరే వదినా ! మరి ఒకపాట పాడవూ"— తెప్పరిల్లి వదినను బ్రతిమాలాడింది మంజరి.

"ఎక్కువసేపు బ్రతిమాలించుకోనక త్వరగా పాడమ్మా"
మృదువుగా అత్తగారు ఆజ్ఞాపించింది.

కుంతల చిరునవ్వుతో,

"సామజవరగమనా" హిందోళరాగంలో తన శ్రావ్య కంఠంతో రమ్యంగా పాడింది కుంతల.

మరీ మరీ అడుగుతూ మరి రెండుకృతులు పాడించారు కుంతలతో అత్తగారు, మామగారు, బావ, మరిది అందరూ ఏకస్వమై.

*　　　*　　　*

బట్టలుతికే వదిననుచూసి మంజరి ఆశ్చర్యంగా,

"వదినా! చాకలిలేదూ! నీకెందుకు శ్రమ? అయినా కలవారి ఆడపడుచు ఎందుకమ్మా అంతకష్టం?"

"అదేమిటమ్మా! మనపని మనం చేసుకొనుటలో తృప్తి, లాభము, శుచి, శుభ్రత అన్నీ వస్తాయి. అలవాటయితే కష్టమేమీ ఉండదమ్మా!"

సౌమ్యంగా ఆడబడుచుకు నచ్చచెప్పింది కుంతల.

"అన్నాయికి వ్రాస్తానుండు. వదిన అల్లరిదవుతోందని"—
కిలకిలనవ్వింది మంజరి.

కుంతల అత్తగారింటిని అవగాహన చేసుకుంది. ఇంటి దగ్గర ఉన్నట్టు ఇక్కడ ఆహారనియమాలు, కట్టుబొట్లు, క్రమ శిక్షణ, సంస్కారంలాంటి మాటలకు అర్థంకూడ కనిపించుట లేదు. అక్కడవలె నన్నగారు ప్రతి చిన్నవిషయం హృదయ పూర్వకంగా తమముందు ఉంచి తమ సలహాలను తీసుకుంటూ

తమ వ్యక్తిత్వాలను పెంచే విధాన మేమీ ఇక్కడ గోచరించుటలేదు. ఎవరిష్టము వారిది కాదు. మగవాడు అనే అహం కన్పిస్తోంది మామగారిలో. తన ఆజ్ఞమీరుటకు ఎవరికీ హక్కు లేదన్నట్లు సంకుచిత్వం కన్పిస్తోంది. ఎంత తేడా ? నాన్న ఆజ్ఞాపిస్తారు. కాని అందులో మంచి చెడు విచక్షణ, మానవత్వ వికాసం, వ్యక్తిత్వం అన్నీ ఇమిడిఉంటాయి. త్యాగముతోనే పుట్టారా అనిపిస్తుంది నాన్న. మంచిదుస్తులువేసుకొని టిప్ టాప్‌గా ఉండుట తనేనాడూ చూసి ఎరుగదు. అతి నిరాడంబరంగా ఉంటూ ప్రతినిముషం బిడ్డల ఔన్నత్యం, బిడ్డల సంతోషము, బిడ్డల వ్యక్తిత్వాన్ని పెంచుట— ఇవే ఆలోచనలు. ఏం చేస్తున్నారో ! అమ్మ ఎంత అదృష్టవంతురాలు, నాన్నను భర్తగా పొందినందుకు ! ప్రేలుపెట్టి చూపించుకొనుటకు అవకాశము లేకుండా అతిజాగ్రత్తగా నడిపించుకొచ్చే భర్తను పొందినదానికంటె స్త్రీకి ఇంకేమి కావాలి !— నిట్టూర్చింది సంతృప్తిగా కుంతల.

అత్తగారింట్లో అందరికీ కనులపండువగా కళకళలాడుతూ కాశ్మీరలిల్లీలా సౌందర్యాలను వెదజల్లి, జీవితంలో మరువలేని అనుభూతులను వారికి వదలి పుట్టినింటికి బయలుదేరివచ్చింది కుంతల. అక్కనుచూసి పొంగిపోయిన సమత,

"అక్కా ! అక్కా ! మీరు కాశ్మీరులో దిగిన ఫొటోలన్నీ వచ్చాయి. నాన్న నీవు వచ్చేవరకు కట్ట ఊడతీయనీయలేదు. ఇవిగో" అంటూ కట్ట తెచ్చింది గబగబ.

"అదేమిటి సమతా ! నాతప్పని ఇంట్లోకి రాకుండానే!" శారదాంబ తృప్తితీరా గృహిణిలా నిండుగా ఉన్న కూతురిని చూస్తూ అంది.

కట్టడూడదీసిన సమత, చూస్తున్న అందరూ దిగ్భ్రాంతి చెందారు.

మంచుతో కప్పబడిన హిమాలయాల ప్రాంగణంలో పువ్వులతో అమర్చినబాటలో అందాలుచిందిస్తూ అతిమనోహరంగా ఉన్నకుంతలను రఘు తీసిన ఫోటో అది. నాలుగు వక్కలయిఉంది.

ముల్లులా గుచ్చుకున్నాయి ఆ గాజుముక్కలు జయరామ్, శారదాంబ హృదయాలలో.

"మరల కట్టించవచ్చులే ! దానిగురించి బాధెందుకూ" అతి తేలికగా నివ్వెరపోయిన వారిని చూస్తూ అంది కుంతల.

*　　　　*　　　　*

కాలం పరుగుపుచ్చుకొన్నట్లువుతుంది కొంతమందికి. కాని కొందరికి స్వల్ప కాలం యుగాలుగా నడుస్తుంది. కుంతల రఘు విరహంలో అతిబాధగా గడిపింది కాలాన్ని.

ఆ రోజు సూర్యకిరణాలు ఇసుకరేణువులను వింతవింత రంగులతో నింపి తన ప్రతిభకు విర్రవీగుతున్నాడు. కృష్ణ సుతారంగా నిర్మలంగా పయనిస్తోంది. జయరామ్ మేడ ముందు భాగంపై విరగపూచిన మాలతీలత ఎగిరెగిరి కోస్తున్న కుంతల

సౌందర్యాన్ని చూస్తూ విరగబడి నవ్వుతోంది. పొట్టి పువ్వుల లంగా, పొంగులూరే యౌవ్వనాన్ని దాచలేక అసహాయతను చాటే చాలీచాలని పావడా, బిగుతుగావున్న పొట్టిబ్లౌజు, సాక్షాత్తు పల్లెటూరిపిల్లలా ఉన్న కుంతల సహజ సౌందర్యం అకస్మాత్తుగా వచ్చిన రఘును లోనికిరానివ్వలేదు. అలాగే నిశ్శబ్దంగా చూస్తూ నిలబడిపోయిన రఘును, కోసినపూలను పమిటలో వేసుకుంటూ చూసిన కుంతల ఒక్కసారిగా సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది. ఒక్క క్షణం తన మెరిసే విశాల నేత్రాలతో తనివితీరా భర్త సౌందర్యాన్ని చూసి మరులుగొలిపే పులకరింతలతో పరుగెత్తింది లోనికి.

ఈ పర్యాయం, రఘు మరింత దగ్గరయ్యాడు అందరికీ. ఇంట్లో ఒక వ్యక్తిగా కలసిపోయాడు. రఘు సహజ శుచి శుభ్రతలు, క్రమశిక్షణగల ప్రవర్తన, అధునాతనభావాలు జయరామ్‌ను మరీ ఆకర్షించాయి. కుంతల ఆనందడోలికల్లో నాలుగురోజులు మైమరపించి శలవులు ఎక్కువలేవని వెళ్ళిపోయాడు రఘు.

సమత కాలేజీకి వెళ్ళుటవలన రఘుకు ఏమీ తోయలేదు. సందడీ లేదు. కుంతలకు భర్త రాక పోక ఈ పర్యాయం కలలాగా తోచింది.

# 20

"అమ్మా ! అన్నీ సర్దాలి. ఈ పర్యాయం తీసుకువెడ తారట."

"అలాగేలే అమ్మా !" అంది. కాని నీరసం ఆవహిం చింది శారదాంబకు.

కుంతల గ్రహించి నవ్వుతూ,

"నీవుకూడ వచ్చేయమ్మా !"

"నాన్న నేంచేస్తావు మరి" నవ్వుతూ అంది శారదాంబ.

"కుంతలా ! కుంతలా !

కుంతల తృళ్ళిపడింది తండ్రిపిలుపులో ఖంగారువిని. గుండెలు అరచేతిలో పెట్టుకుంటూ వచ్చింది.

"నీకు నిన్న లెటరువచ్చిందా కుంతలా"

"వచ్చింది నాన్నా !"

"కట్నంగురించేమైనా వ్రాశాడా రఘు."

జ్ఞప్తికి వచ్చింది తన పొరపాటు. కాని, కావాలనే చేసింది, నాన్న బాధపడతారని. డబ్బు, పొలము చదివించి నందువలన డబ్బు పెళ్ళినాడే తీసుకువెళ్ళి, పొలముక్రింద ఇప్పుడు వెంటనే డబ్బు పంపించవలసిందిగా రఘు తండ్రి ఆజ్ఞా పించాడు. నాన్నకు చెప్పంటూ వ్రాశాడు రఘు. ఇంటి పరిస్థితి అంతా తెలిసిన తను తండ్రికి చెప్పలేకపోయింది.

"వ్రాశారు నాన్నా !" కాలివ్రేళ్ళు భూమికివ్రాస్తూ తలవంచుకొని అంది కుంతల.

(13)

"మరి ఎందుకు చెప్పలేదమ్మా! నాకు తెలుసు, బాధ పడతానని చెప్పిఉండవు. నాకేం బాధమ్మా! డబ్బులేనిమాట నిజమే. ఉన్నదంతా ఖర్చయింది. అయినా వాళ్లు కావాలన్నప్పుడు తప్పుతుందా, ఇచ్చివేద్దాము. కాని రఘు ఇలా వ్రాయకుండా ఉంటే నాకు సంతోషం కలిగేది" అంటూ బాధగా రఘు వ్రాసిన లెటరు కుంతలకియ్యబోతూ మరల కుంతల బాధ పడుతుందని వెనుకకు తీసుకున్నాడు జయరామ్.

తండ్రిబాధను గమనించిన కుంతలకు రఘుపై చిరు కోపమొచ్చింది. అలాగే కోపంతో లెటరువ్రాసింది.

తండ్రి ఆజ్ఞవలన ఘాటుగా మామగారికి వ్రాసిన తరువాత పశ్చాత్తాపం చెందాడు రఘు. గోరుచుట్టుపై రోకటి పోటులా కుంతల కళ్ళెర్రచేసి వ్రాసిన లెటరు ఇంకా బాధను కల్గించింది. చిరాకుచెందిన రఘు కొద్దిరోజులలోనే శెలవుపెట్టి కుంతలదగ్గర వ్రాలాడు. సమయానికి దీపావళికూడా ఆహ్వానించింది రఘును. మరదలు, బావమరదుల హాస్యాలతో తన బాధను మరచి మామూలుగానే తిరుగగలిగినా మామగారిని వెనుకటిలా పలుకరించలేకపోయాడు. జయరామ్ అల్లుడిపట్ల జాలిచెందాడు. హృదయపూర్వకంగా ప్రేమార్ద్రితలతో పలుకరించి వేదాంతచర్చలు, రాజకీయాలు, ఇతరవిషయాలు గంటలతరబడి మాట్లాడేవాడు జయరామ్ అల్లునితో. దీపాల వెలుగులీనుతున్నలతో, మతాబులు, చిచ్చుబుడ్ల ముత్యాల విద్యుల్లతలలో కుంతల సౌందర్యదీపికలు కలియుగా ఆనందంగా వెళ్ళిపోయింది దీపావళి.

కుంతల ఈ పర్యాయం కాగా పట్టుబట్టుటవలన రఘు అంగీకరించాడు కుంతలను ఢిల్లీ తీసుకు వెళ్ళుటకు. కుంతల ఆనం దానికి మేర లేదు. లోలోపల ఇక్కడనుండి దూరంవెళ్ళి అంద రికీ దూరమై, ఎలాఉండాలో అన్న దిగులున్నా, హాయిగా స్వేచ్ఛగా తను భర్త సాన్నిధ్యంలో మైమరచిపోవచ్చు అన్న భావనతో కుంతల నేత్రాలు మెరిసిపోతున్నాయి మరింతగా.

భర్తకు టిఫిన్ తీసుకు వెడుతున్న కుంతల తండ్రిపిలుపుకు అనుమానించింది మరల ఏదో ఉందని. అనుమానం నిజమే అయింది.

"ఈ ఉత్తరం రఘుకు ఇవ్వమ్మా"—తండ్రి తెల్ల బోయిన ముఖం కుంతలను ఖంగారుపరిచింది.

"మీ మామగారు అత్తగారు వ్రాశారు. వాళ్ళబ్బాయి చదువు పాడయిపోతోందట. మీ అమ్మాయిని పంపిస్తారని తెలిసింది. ఏమైనా సరే పంపించుటకు వీలులేదు. ట్రైనింగ్ పూర్తికావలసిందే నంటూ వ్రాశారు. ఉత్తరం చదువుకో నీవుకూడ. ఏమిటోనమ్మా! మొదటినుండీ మనమెంత దగ్గ రగా ఉందామన్నా వాళ్ళు దూరదూరంగా జరుగుతున్నారు. ఎంత ఓర్పుపట్టినా మితంలేకుండా ఉంది. నిన్ను ఎంత సుఖ పెట్టాలనుకున్నా ఈ సంఘటనలు నీ సుకుమార హృదయాన్ని బాధించటం తప్పటలేదమ్మా! అయినా ఈసారి నేను విన దలచుకోలేదు. బాధపడకమ్మా! వెడుదువుగాని. సర్దుకో అన్నీ చక్కగా" అంటూ ధైర్యం చెప్పాడు వెలవెలబోయే పద్మం లాంటి కూతురి ముఖంచూస్తూ జయరామ్.

భర్త ఏమంటారోనని ఆలోచించుకుంటూ వెళ్ళి లెట రందించింది. రఘు ఆతృతగా చదువుకుంటుంటె భర్తముఖాన్ని పరిశీలిస్తూ దడదడలాడే గుండెలతో కూర్చుంది కుంతల. పూర్తి చేసిన రఘు పకపక నవ్వేశాడు అతితేలికగా. తెల్లబోయింది కుంతల.

"చూశావా మరి! నీ ప్రభావం ఎలాపడిందో అమ్మ నాన్నల మీద. నీవు నా దగ్గరుంటే నేను ఈ లోకంలో ఉండనని...మరీ నీకింత పేరువస్తే నేను ఏమైపోవాలోయ్!" కుంతలను హృదయానికి హత్తుకుంటూ అన్నాడు రఘు.

"రఘూజీ! నన్ను బాధపెట్టవద్దని ప్రార్థిస్తున్నాను. నాకేమిటో భయంభయంగా ఉంటోంది. నన్నువిడచి వెళ్ళ వద్దు. నేనూ వస్తాను ఢిల్లీ"—వెక్కి వెక్కి ఏడ్చింది కుంతల.

"పిచ్చిపిల్ల! ఎందుకుభయం?"

"కాదు రఘూజీ! మన దాంపత్యం, మనసుఖం అందరికీ కన్నుగుట్టుతోంది. మనం కృష్ణఒడ్డుకు షికారుకు వెడుతూ ఉంటే ఎలా చూస్తున్నారో జనం, మీరు చూడటంలా! ఇక్కడ ఈ ప్రజలలో నేనుండలేను రఘూజీ! నన్ను హింసించవద్దు."

"అంత మాటలనకు కుంతలా! నేను తీసుకువెడతానని చెప్పానుగా, బాధపడకు. ఏదీ నవ్వు! ఒక్కసారి! నవ్వాలి మరి"—కుంతలను ప్రేమగా హృదయానికి హత్తుకున్నాడు రఘు.

ఆరోజు మాలతీలత విరగబూచింది. గులాబీలు వయ్యారంగా కుంతల పెంపకంలో ఉయ్యాలలూగుతున్నాయి. సంపెం

గలు మత్తులు కల్గిస్తున్నాయి. మబ్బుమబ్బుగా వాతావరణం ఎంతో హాయినికల్గించుతోంది.

శారదాంబ చెప్పినవార్త జయరామ్‌కు మధురవీణా నాదంవలె మైమరపించింది. నాతల్లి లాంటిదే పుట్టాలి. నాతల్లి పెంచుకోలేదు. ఇక్కడ మాకు మాత్రం ఎవరున్నారు దగ్గర. మేమే పెంచుతాము. భర్తకు చెప్పిందో లేదో, నేనే చెప్తాను ఈ వార్త. సంతోషంలో చిన్నపిల్లవాడిలా అయిన భర్తను చూచిన శారదాంబకు కళ్ళు చెమర్చాయి, ఆనందంతో. క్రిందికివచ్చిన అల్లుడికి మిఠాయి అందించాడు జయరామ్. రఘు తెల్లబోయాడు.

"తండ్రివి కాబోతున్నావు రఘూ !" ప్రేమాతిశయం ముప్పిరిగొనగా తడబడేమాటలతో అన్నాడు జయరామ్.

సిగ్గుపడి పైకివెళ్ళి కుంతలకోరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు వేయికళ్ళతో. నిండుగా అలంకరించుకు వచ్చింది అజంతా సౌందర్యకాంతులు వెదజల్లుతూ కుంతల. షిఫాన్ ఆకుపచ్చచీర, అదేకలరు బ్లౌజు, నిండుభూషణాలతో ఏ దేవత వచ్చిందా అన్నట్లు దిగ్భ్రాంతిచెందాడు రఘు.

"అమ్మదొంగా ! ఎంత గయ్యాళివయ్యావు నీవు !"— ఒక్కసారిగా కుంతలను బాహువులతో బంధించి ప్రేమగా అన్నాడు రఘు.

గ్రహించిన కుంతల సిగ్గుదొంతరుల ముసుగులో దోబూచులాడింది.

"ఇకమీదట అమ్మాయిగారు ఆరోగ్యనియమాలు జాగ్రత్తగా చూచుకోవాలి."

"ఇప్పటివరకు అనారోగ్యంఎరుగనుస్వామీ! ఇకమీదట కూడ అలాంటికోరిక నాకు వద్దు" పెంకిగా సమాధానమిచ్చింది కుంతల.

"మరి ప్రయాణానికి అన్నీ సర్దుతున్నావా ?"

"కొన్ని సర్దిఉంచాను. రేపు వెళ్ళి లేడీడాక్టరుకు చూపించివస్తానంటోంది అమ్మ" సిగ్గుతో తలవంచుకుని అంది కుంతల.

"నేనూ వస్తాను. నిన్నువదలి ఇక్కడ నేనెందుకు ?"— మృదుమధువువలె ఉన్న కుంతల చెక్కిళ్ళను నిమురుతో అన్నాడు రఘు.

"మీరెందుకు ?" అంటూ పకపక నవ్వింది కుంతల.

"కుంతలా యిలా రామ్మా!"

తల్లిపిలుపు విన్న కుంతల,

"అమ్మ పిలుస్తోంది, శలవా మరి" అని భర్త చేతుల్లో నుండి విడిపించుకుంటూ బయటకువచ్చే కుంతలను వెక్కిరిస్తూ "అమ్మ పిలుస్తోంది" అన్న రఘుమాటలకు నవ్వుతూ మెట్లుదిగుతున్న కుంతలకాళ్ళు మెలికలు తిరిగి పోయాయి. బలంతో నిగ్రహించుకొనుటవలన నాలుగు మెట్లమీద మాత్రం జారిపడిపోయి గట్టిగా గోడపట్టుకొని నిలబడింది.

ఆయాసంతో వచ్చిన కూతురినిచూసి "అలా గంతులు వేయకమ్మా ! ఇప్పుడు వేయకూడదలా" అని హెచ్చరించింది.

ముసిముసినవ్వులతో అంటున్న తల్లివైపు అమాయ
కంగా చూసి, కుంతల

"కాదమ్మా! మెట్లమీద కాళ్ళేమిటో మెలికలు తిరి
గాయి" అంది.

"ఎందువలనమ్మా! కళ్ళు తిరిగాయా"—ఖంగారు
పడుతూ అంది శారదాంబ.

"లేదమ్మా కళ్ళు తిరగలేదు."

కూతుర్నివైపు నిశితంగా చూచింది శారదాంబ. నెల
తప్పిందన్నమాటేగాని రెండు నెలలు నిండవస్తున్నా ఎక్కడా ఏ
సూచనా లేదు. అయినా రేపు డాక్టరు దగ్గరకు వెడుతున్నా
ముగా అని తేలికపడింది శారదాంబ హృదయం.

ఆరాత్రి అర్ధరాత్రి ఫెళఫెళ శబ్దముతో నిదురలో
జోగాడుతున్న మానవులను భూమాత కదలించివేసింది.
దాదాపు పదినిముషాలు ఉరుములవలె భీకరశబ్దము, భయం
కర అరుపులతో నిండిపోయింది ఆ సమయం. భర్త బాహు
వుల్లో పరవశమై నిదురించే కుంతల, రఘుతో సహా క్రిందికి
దొర్లి పెద్దకేక పెట్టింది. నిదురించే శారదాంబ జయరామ్‌లు
క్రిందికి దొర్లి వింతగా అరిచారు. ఎవరికివారే తెలియకుండానే
కేకలు వేసిన ఆ పదినిముషాలు ప్రళయదేవత వికటాట్టహాసం
తాండవం చేసింది.

అందరూ ప్రోగయ్యారు వసుమతి శాంతించిన తరు
వాత. అందరూ మీరు చూడలేదంటే మేము చూడలేదను
కుంటూ సణుకుతగ్గని తడబడేమాటలు గలగల వినిపిస్తున్నాయి.
జయరామ్, రఘు తమ ఈ అనుభవాన్ని గురించి ముచ్చటించు

కున్నారు. కుంతల తల్లిని కౌగలించుకొని అదిరిన గుండెలను అదుపులోనికి తెచ్చుకుంది. వింతగా తెల్లవారింది. సూర్య భగవానుడు తన వేడికిరణాలను వెదజల్లుతున్నాడు. కుంతలను తీసుకొని జయరామ్, శారదాంబ, రఘు బస్తీకి వెళ్ళారు డాక్టరు పరీక్షకై.

విధి ఎవరికి ఏవిధంగా ఎదురవుతుందో తెలియదు. మానవుల జీవితాలు విధిచేతిలోని ఆటబొమ్మలు. ఈ శరీరము, ఈ సంఘటనలు, ఈ బాహ్యాం ఆలోచిస్తే అన్నీ క్షణభంగురాలే! కాని ప్రతి చిన్న సంఘటనలోను, ప్రతి అడుగు అంతిమక్షణం వరకు జాగ్రత్తగానే వేస్తూవుంటాము. ఇదే అసలు తెలియని రహస్యం. ఈ రహస్యం తెలిసిన మనిషి, మనీషి అవుతున్నాడు. నాలుగుక్షణాల జీవితకాలమనే కళకు విశిష్టమైన ప్రత్యేక రంగులు వేసి నలుగురిని ఆనందింపజేసి తను ఆనందిస్తున్నాడు. పోయినతరువాతకూడ అతనికుంచె మరొకరు తీసుకునేట్లుగా స్థిరస్థాయి అవుతున్నాడు.

లేడీడాక్టరు కుంతలను పరీక్షించి బాధగా నొసలు చిట్లించింది. పర్యవసానం గర్భిణీకాదు. "ఇది అనుమానాస్పదమైనదిగా ఉంది. ఎక్కడికైనా తీసుకువెళ్ళవలసివస్తుంది. తీసుకు వెడితే మంచిది." అంటూ మెల్లగా బాధపడుతూ చెప్పింది జయరామ్ రఘులకు.

ఇది విన్న జయరామ్ కలతచెందాడు. రఘుకు అంతా చీకటిగా తోచింది. నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్న శారదాంబ, కుంతలవైపు చూసిన రఘు, జయరామ్ చెప్పలేక చెప్పారు విషయాన్ని.

కుంతల లేవెన్నెల కురిసినట్లు పకపక నవ్వి,

"ఇంకన్నీ అనుమానాలే! ఆరోగ్యంగా ఉన్న నాకు ఏమిటో జబ్బట! ఎక్కడికైనా తీసుకువెళ్ళాలట! మరి ఎక్కడికి తీసుకువెళ్లాలో అడగలేకపోయారూ!" పరిహాసంగా అంది కుంతల.

"నిజమే, బాధపడుతూ ఆ విషయమే అడగలేదు డాక్టరును" అనుకుంటూ జయరామ్ డాక్టరును ప్రశ్నించాడు తిరిగి.

"మద్రాసు జనరల్ హాస్పిటల్ సివిల్ సర్జన్ డాక్టరు ఫిలిప్‌గారికి నేను లెటరు వ్రాస్తాను. తీసుకువెడితే మంచిది."

"అలాగే వ్రాసి ఇవ్వండి. అయినా ఏమిటండీ అనుమానం!" వ్యాకులపడుతూ అడిగాడు జయరామ్.

"మరేం ఖంగారు చెందవలసినది లేదు. తీసుకువెడితే మంచిదని చెపుతున్నానంతే!"

తడబడుతూ లెటరు తీసుకువచ్చాడు జయరామ్. అందరిలోనూ నిశ్శబ్దత ఆవరించింది. కుంతల ఈ గొడవతో తన ఢిల్లీ ప్రయాణం వాయిదా పడదుకదా అనుకుంటూ బాధ పడింది.

జయరామ్ ఆలస్యం చేయలేదు. ఎప్పుడూ అహర్నిశలూ ఆరోగ్యవిషయంలో అతి పదిలంగా చూచుకుంటూ పెంచుకున్న బిడ్డలకు ఇంతవరకు ఏ అనారోగ్యమూ ఎరుగడు, ఒక్క మల్లిక్‌కు మినహా. శారదాంబకూడ తొందర చేయుటవలన

వెంటనే మద్రాసు ప్రయాణమయ్యారు అందరూ బెదురు తున్న గుండెలతో.

జయరామ్ స్నేహితుని కుమారుడు శ్రీధర్ మద్రాసులో ఉద్యోగరీత్యా ఉన్నాడు. వీరు వెళ్ళేసమయానికి భార్య లేనందున ఇల్లంతా విశాలంగా ఉంది. రఘు పర్సనల్ గా ఫిలిప్ కు చూపిస్తాననుటవలన జయరామ్ ఆగిపోయాడు.

హాలులోనికివచ్చిన డాక్టర్ ఫిలిప్ అలాగే దిగ్భ్రమ చెందాడు. లేతగులాబీ జరీపువ్వులచీర, ఎరుపురంగు జార్జిట్ బ్లౌజు ధరించి అందాలతారలా, అజంతాశిల్పంలా ఉన్న కుంతలను, అందుకు తగినట్లుగా ఆకర్షణీయంగాఉన్న రఘును చూసి సర్దుకొని,

“ఏమిటండీ ఇలా వచ్చారు” అని రఘును ఇంగ్లీషులో అడిగాడు.

లెటరిచ్చి విషయం చెప్పాడు రఘు. లెటరు చదువుకొని పకపకనవ్వాడు డాక్టర్ ఫిలిప్.

“అమ్మాయి అంత ఆరోగ్యంగా ఉంటే మీకెందుకొచ్చిందండీ అనుమానం ! మరేం ఖంగారులేదు. రామ్మా! ఇలా రా !” అంటూ పిలచి కుంతలను పరీక్షచేసి సంతృప్తిగా నిట్టూర్చారు డాక్టర్ ఫిలిప్.

రఘు సిగ్గుచెందాడు. కుంతల వెక్కిరించింది. శారదాంబ, జయరామ్ విని సంతృప్తిచెందారు. శ్రీధర్ ప్రేమాప్యాయాలతో కావలసిన అవసరాలన్నీ చూస్తున్నాడు శ్రద్ధగా, తండ్రిస్నేహితుడు జయరామ్ పట్ల ఉన్న భక్తిగౌరవాలవలన. కుంతలను చూసి అచ్చెరువుచెందాడు. జయరామ్ శ్రీధర్ కు

కృతజ్ఞత చెప్పి ప్రయాణానికి సిద్ధంచేశాడు. రఘు ఇటునుంచి ఢిల్లీ వెళ్ళిపోతానంటే కుంతల గొడవచేసి భర్తను ఆపింది. సామానులన్నీ సర్దుతున్నారు. కుంతల ప్రత్యేకంగా షాపింగ్‌కు వెళ్ళి ఎన్నోకొట్లు తిరిగి తనకు కాపురానికి కావలసినవన్నీ ఖరీదుచేసి తెచ్చుకుంది. శారదాంబ మురిసిపోయింది.

మీరందరూ వెళ్ళగానే శ్రీధర్ నాకేమీ తోయదంటే అంటూ స్నేహితుడయిన రఘుతో కబుర్లు చెపుతున్నాడు. శారదాంబ, కుంతల తెచ్చినవన్నీ జాగ్రత్తగా సర్దుతూ ఉంది. కుంతల భర్తకు, తండ్రికి, శ్రీధర్‌కు ట్రేలో ఫలహారము, టీ ఉంచి తీసుకువస్తోంది. ఒక్కసారిగా ఆకాశం దద్దరిల్లినట్లయింది. కుంతల ఒక్క గావుకేక పెట్టింది. అతి జాగ్రత్తగా చేతులలో ట్రే అలాగే ఉంచి కూర్చుండిపోయింది నిస్సత్తువగా. శారదాంబకు కుడికన్ను అదిరింది. అందరూ ఖంగారుపడుతూ ఒక్కసారిగావచ్చి కుంతల చేతిలోని ట్రే అందుకొని,

"ఏమిటమ్మా! ఏమయింది? అంత కేకవేశావేమిటి?" అంటూ చుట్టుముాగారు.

కుంతలకు ఏమయిందో తెలియలేదు. తనకు తెలియకుండానే కేకవేసింది. ఇప్పుడు సిగ్గనిపించి గబగబ లేవాలని ప్రయత్నించింది. కాళ్ళు వేలాడబడిపోతున్నాయి. ఎంత స్వాధీనంలోనికి తెచ్చుకోవాలన్నా తెచ్చుకోలేకపోయింది. మొదటిసారిగా తన ఆరోగ్యాన్ని గురించి భయపడింది.

"లే అమ్మా! ఏమిటి, ఏంబాధ కల్గింది!" అంటూ శారదాంబ కుంతలను లేపాలని ప్రయత్నించింది. శారదాంబ

స్వాధీనం కాలేదు. గాబరాపడి శారదాంబను ప్రక్కకు వెళ్ళమని రఘు ప్రయత్నించాడు. లేవలేక జాలిగా చూస్తూ "నాకేమిటో కాళ్ళు లేవనే అన్పిస్తోంది" అంది కుంతల.

"అలా అనకమ్మా! లే ప్రయత్నించు. ఎందువలన నిస్త్రాణగా ఉన్నావో?"

జయరామ్ తెల్లటి అరటిదూటలా మెరుస్తున్న కుంతల పాదాలను వత్తిచూశాడు. చల్లబడిపోతున్నాయి. జయరామ్ గుండెలు దడదడలాడాయి.

ఏమిటో అంతా అయోమయంగా ఉంది. లేపండి పడుకోబెడదామంటూ ప్రక్కమీదికి చేర్చారు, లేడిలా గంతులువేసే కుంతలను.

హాస్పిటల్‌కు తీసుకువెళ్ళే ప్రయత్నంలో టాక్సీకొరకు జయరామే వెళ్ళాడు. రఘు భయంకరమైన కారుచీకటిలో కుంతలను చూస్తూ నిలబడిపోయాడు.

"అయ్యో భగవానుడా! ఏమిటిది? ఏ అఘాయిత్యమూ జరుగనీయకు స్వామీ! మేము ఏ పాపమూ చేసి ఉండలేదింతవరకు. మాకు ఏకష్టమూ కల్గించకు తండ్రీ" అంటూ వెక్కి వెక్కి ఏడుస్తున్న తల్లిని చూసి కుంతల హృదయం తరుక్కుపోయింది.

"ఏమిటమ్మా! నాకేమిటి? బాగానే ఉందమ్మా! నాకేం బాధలేదు. ఖంగారుపడవద్దు మీరనవసరంగా" అంటూ భర్తవైపు, శ్రీధర్ వైపు చూసింది.

జయరామ్ వణుకుతున్న కాళ్ళు చేతులను అదుపులోనికి తెచ్చుకుంటూ అందరిసాయంతో కుంతలను తీసుకొని

టాక్సీలో పరుండబెట్టి జనరల్ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి డాక్టర్ ఫిలిప్ వార్డులో జాయిన్ చేశారు. డాక్టర్ ఫిలిప్ అత్యంతాశ్చర్య కరంగా కుంతలను పరీక్ష చేసి విధికర్కశత్వానికి పళ్ళు పటపట లాడించి దిగులుగా తనగదిలో కూర్చున్నాడు.

"ఇంత సౌందర్యబాలకు ఇదా ? ఏమిటి ప్రభూ నీ పరిహాసం ?–" అనుకుంటూ ఎక్స్‌రే తీయటం పూర్తిచేశాడు. ఎన్నడూ హాస్పిటల్‌లో ఉండి ఎరుగని కుంతల, వాసనకు భరించలేక వాంతిచేసుకుంటోంది. నడుముదగ్గరనుంచీ స్పర్శజ్ఞానము పూర్తిగాపోయింది కుంతలకు. శారదాంబ తల్లడిల్లిపోతోంది. రఘు, జయరామ్ కాలుగాలినపిల్లుల్లా తిరుగుతున్నారు అటూ ఇటూ.

కుంతల అందరినీ నిశితంగా పరీక్షచేసి ఖంగారుపడుతున్నారని గ్రహించి,

"ఏమిటమ్మా నాకేం కాలేదు, నాకు హాయిగాఉంది." తను ధైర్యం చెప్పుకుంటూ అందరికీ ధైర్యం చెపుతోంది.

డాక్టర్ పిలుపువిన్న జయరామ్, రఘు అదిరే గుండెలను అదుపులోనికి తెచ్చుకోవాలని వృథాప్రయత్నంచేస్తూ వెళ్ళారు.

ఆ దంపతులను చూడగానే "నన్ను నేను మోసంచేసుకొని విధినే ఓడించాలని ప్రయత్నించాను. కాని విధి బలీయమైనదని మరొకసారి గ్రహించవలసి వచ్చింది.'' ఏసుక్రీస్తువైపు చూస్తూ బాధగా అన్నారు డాక్టర్ ఫిలిప్.

"ఏమిటండీ! ఏమిజబ్బు !" దడదడలాడు గుండెతో అడిగాడు జయరామ్.

"మీరు ఆ అమ్మాయికి తండ్రికదూ! మీకు చాలా కఠినమైనమాట చెప్పవలసివస్తోంది. అయినా తప్పదు. అమ్మాయి నాలుగురోజులుకంటె ఎక్కువ జీవించదు."

ఆకాశమంతా విరిగి జయరామ్‌మీద పడినట్లయింది. గిలగిలా కొట్టుకుంది హృదయం. దుఃఖపూరితమైన మాటలతో,

"లేదండీ! అంతమాట అనవద్దు. బంగారాన్ని అపురూపంగా పెంచుకున్నాము. ఇక్కడ కాకపోతే విదేశాలకైనా తీసుకువెళ్ళగలను. ఏవిధంగానైనా సరే అమ్మాయిని బ్రతికించండి." జీవితంలో కన్నీరుకార్చని జయరామ్ జలజల కన్నీరు కారుతూఉంటే డాక్టర్ చేతులను పట్టుకొని బ్రతిమాలుతూ అన్నాడు.

ఈ మాయాబంధనాలు ఒక్కసారిగా డాక్టర్ ఫిలిప్‌కు వింతగా గోచరించాయి.

"లేదండీ! విదేశాలలో ఎక్కడా ఇంతవరకు కనిపెట్టలేదు. ఇది కాన్సర్."

తృళ్ళిపడ్డారు రఘు, జయరామ్‌లు. చంటిపిల్లవాడిలా జయరామ్ ఏడ్వసాగాడు. వారిద్దరినీ ఎలా ఓదార్చాలో తెలియని డాక్టరు ఫిలిప్ బాధగా నుదుటినితాకుతూ ఆలోచించసాగాడు.

"చూడండి! ఒక్క చిన్న ఆశాకిరణం! ఎక్సరే ట్రీట్‌మెంటు పనిచేయవచ్చు. ప్రారంభిస్తాను. మీరే అలా అయితే ఇంక తతిమ్మావారెలా అయిపోతారు. ధైర్యంగా ఉండాలి మరి."

అలా ఎంతకాలం విధిని దూషిస్తూ ఏడ్చారో తెలియదు, నర్సువచ్చి ఓదార్చేవరకు.

శారదాంబకు, కుంతల నవ్వుతూ కబుర్లు చెబుతోంది తల్లికి ధైర్యంచెప్పాలని. ఆ దృశ్యంచూచిన జయరామ్ హృదయం ముక్కలయింది.

శారదాంబ భర్త ముఖంలోని విషాదనీడలను గుర్తించింది. కాని అడిగినందువలన ఏ వార్త వినవలసివస్తుందోననే భయంతో తలవంచుకుని కుంతలను కంటికిరెప్పలా కాపాడుతోంది. జయరామ్ సందేహించాడు, శారదాంబకు సత్యం చెప్పటానికి. శారద బ్రతికేదిలేదు. నేను పిల్లలు అడవిపాలయిపోవాలి. నాతల్లి విన్నా పదిరోజులు జీవించేది రెండురోజులు జీవించదు—లోలోన కుమిలిపోవటానికే నిశ్చయించుకున్నాడు జయరామ్.

రఘు నిశ్చలంగా కుంతలనుచూస్తూ కూర్చుండిపోతున్నాడు. జయరామ్ అల్లుడినిచూస్తూ నీరయిపోతున్నాడు. ఇలాంటి గుణవంతుడు ఇంక అల్లుడిగా లభ్యమవుతాడా అనుకుంటూ.

ఎక్సరే ట్రీట్‌మెంటుతో స్పర్శవచ్చినా బాధ ఎక్కువయిపోయింది కుంతలకు. కాళ్లు కదలించలేకపోతోంది. ఆయాసం, నీరసం ఆవహించాయి. కాని భర్త సాన్నిధ్యంలో బాధను మరిచి ప్రేమతో అందించే మందులు, ఆహారం పేచీ పెట్టకుండా తినగలుగుతోంది.

"ఇంకొక్క ముక్క తినాలి మరి"— బతిమాలుతూ యాపిల్ పెడుతున్నాడు రఘు.

"ఎన్నాళ్ళకు తగ్గుతుంది రఘూజీ! ఎప్పుడు మనం ఢిల్లీ వెళ్ళేది? నా ప్రక్క హిందీప్రాంతంవారే ఉంది. హిందీ నేర్చుకుంటానులే బాగా. అక్కడ ఇబ్బందిఉండదు." ఆయాసంతోనే అంటున్న కుంతలమాటలు రఘుగుండెల్లో గ్రుచ్చుకున్నాయి.

"ఎలా ఉందమ్మా?"

తృళ్ళిపడ్డాడు రఘు. మేనత్త, ప్రక్కన నవయౌవ్వని సుకుమారవతిలా ఉన్న సునీత.

తెల్లబోయిన మేనల్లుడితో,

"ఇక్కడే ఉంటున్నాను బాబూ! సునీత కాన్వెంటులో చదువుతోంది" అంది మేనత్త.

ఎంత పెద్దదయింది సునీత! చిన్నప్పుడిలాగే పీలగా చిన్నజడతో ఉండేది. మేనత్తకూతురినీ, మేనత్తను చూడగానే రఘు ముఖం వికసించింది.

"ఏంబావా! మరిచిపోయావా! మంజరి ఎలా ఉంది?" చలాకీగా బావను ప్రేమతో పలుకరించింది సునీత.

కుంతలకు జ్ఞప్తివచ్చింది ఆ సునీత ఈమె.

"బాబూ! అందమైనభార్య, చాలినంత కట్నం తెచ్చుకున్నావని, చూడలేకపోయినా సంతోషించాను. ఈ జబ్బేమిటి బాబూ! బంగారపు బొమ్మలా ఉంది." అంటూ బాధపడింది.

"ఇంకెవరూ లేరూ! అత్తగారు మామగారు ఉన్నారట వేరీ! శ్రీధర్ బాగా తెలుసు, నిన్న ఏదో మాటలమీదనీ వివరాలు చెప్పాడు."

"కూర్చోండి! అమ్మా సునీతా!" కుంతల ప్రేమగా పలుకరించింది.

"భోజనంచేయటానికి ఇంటికివెళ్లారు అత్తగారు, మామగారు. సునీతా! బాగా పెద్దదానివయ్యావు."

సునీత సిగ్గుపడింది.

"నువ్వో అడుగమ్మా! ఇంత పొద్దుగైపోయారే అని" సునీతను సమర్థించింది కుంతల.

*   *   *

కాలం ఉధృతంగా పారే సెలయేరులా పరుగిడుతుంది. కొండలు, పచ్చికబయళ్లు, మిట్టలు, ఆ వాగులక్రింద మునిగి పోయినట్లు ఈ కాలప్రవాహంలో సుఖమూ, బాధలూ, నిట్టూర్పులు అన్నీ కొట్టుకుపోతూ ఉంటాయి.

మద్రాసువచ్చి నెల గడచిపోయింది. కుంతలలో ఏ మార్పూలేదు. కాని పాలిపోయి నీరసించిపోయింది. డాక్టర్ ఫిలిప్ శాయశక్తులా కుంతల లేచి తిరుగుటకు ప్రయత్నిస్తున్నాడని శారదాంబ జయరామ్ సంతోషించారు. సమత, మల్లిక్ ఆదుర్దాగా ఉత్తరాలువ్రాస్తూనే ఉన్నారు. సునీత ప్రతినిత్యం వస్తూ కుంతలదగ్గర కూర్చుని వెడుతూఉంటోంది. రఘు, కుంతలకు అతిసన్నిహితమే అయింది సునీత. రోజురోజుకూ రఘులో మార్పువస్తోంది. అద్భుత రాసక్రీడలతో స్వర్గలోకమును మైమరపించే జీవితం నాలుగురోజులు మురిపించి మాయమయింది. విరహవేదనతో తపించిపోతూ దక్కుతోయని చూస్తు

లతో కుంతలను మరింతగా బాధించుట ప్రారంభించాడు. ఎక్కువగా ఏకాంతాన్నే కోరుకుంటూ తన భవిష్యత్ జీవితం గురించి ఆలోచనలు ప్రారంభించాడు. చిరాగ్గా ఉంటున్న భర్తను గమనిస్తూ కుంతల ఎవరూ చూడకుండా కన్నీరు తుడుచుకుంటోంది, పాలిపోయిన చేతులతో. జీవించాలనీ, త్వరగా ఆరోగ్యం రావాలనీ ఉన్న శక్తినంతా కూడదీసుకొని డాక్టర్ కే ఆశ్చర్యంగొలిపేట్టు వాడుకోసాగింది.

ఆరోజు జయరామ్ హాస్పిటల్ నుండి వచ్చేసరికి రఘు ఉత్తరం గబగబ మడచి జేబులో పెట్టుకొనుట గమనించాడు. అల్లుడిలో మార్పును సూక్ష్మంగానే పరికిస్తున్నా జయరామ్ కుంతల ఆరోగ్యాన్ని గురించి పడేబాధలో పట్టించుకొనుట లేదు. ఒక్కసారిగా జయరామ్‌కు కడుపులో దేవినట్లయింది. నాతల్లి జీవితం ఇంతవరకు వచ్చిందా అనుకుంటూ గిలగిల కొట్టుకున్నాడు. అనుకున్నంతా అయింది.

"రేపు ఉదయం వెడుతున్నానండీ ఢిల్లీ !"

"ఆ !" తృళ్ళిపడ్డాడు జయరామ్.

"నీవుంటేనే కుంతల కాస్త తింటోంది. వెడితే ఏమీ తినదేమో !"

"మీరు భయపెట్టి ప్రయత్నించండి !" రఘు నిర్మొహమాటంగా జవాబిచ్చాడు.

జయరామ్‌కు దుఃఖంతోపాటు కోపంకూడా అవధులు దాటాయి.

"ఏమిటోయి మీ ప్రవర్తన! బిడ్డకు జబ్బువచ్చి బాధపడుతూ ఉంటే అమ్మా, నాన్న వచ్చారా ? చూశారా ! పైగా నీవు

కూడ వెళ్ళిపోతానంటావు. జీవించదని తెలిసిన తరువాతకూడ కట్నం తాలూకు డబ్బు పంపించమని వ్రాస్తాడు మీనాన్న. తల్లికి తెలిస్తే బాధపడుతుందని నాలో నేను కుళ్ళిపోతున్నాను. నాతల్లి బ్రతికి నిన్ను బంధించదు లే. జీవించినన్నాళ్ళయినా ఉండి ఆమెకు సుసశ్శాంతి కల్గించు" దుఃఖంతో పెల్లుబికిన మాటలు తీక్షణంగానే వచ్చాయి.

కాని రఘులో ఏమార్పూలేదు. పైగా,

"నా భవిష్యత్తు నేను చూసుకోనుట తప్పా" అని ప్రశ్నించాడు తన తెలివితేటలను తనే మెచ్చుకుంటూ.

"మర్యాగ్రుడా!" రెచ్చిపోయాడు జయరామ్. "జీవించినన్నాళ్ళు, నీకు సుఖాన్నిచ్చినన్నాళ్ళు నీదన్నమాట. ఇప్పుడు వదలి నీ భవిష్యత్తు చూసుకుంటావన్నమాట. చూడు రఘు! నీవు మానవులలో అగ్రగణ్యుడవు అనుకున్నా! నీలో అత్యంత ప్రేమ, త్యాగము, శీలము, సంస్కారము ఉన్నాయని అనుకున్నా. అందుకే మీనాన్నదగ్గర నావ్యక్తిత్వాన్నంతా చంపుకొని నిన్ను నాతల్లికి అప్పగించాను గర్వంతో. నాతల్లికి నీయందు ఇవేభావాలున్నాయి. ఆ భావాలు చెదరగొట్టకు. అవి అలాగే ఉంచు. నీవు భవిష్యత్తులో ఏం చేసుకున్నా నాకు బాధలేదు. ఈ కోరిక ఒక్కటి తీర్చు. నా తల్లిహృదయంలో భర్త ఇలాంటివాడనే బాధను ప్రవేశపెట్టకు. నీయందున్న భావాలన్నీ మసిఅయిపోయినాయి. నీ రంగులన్నీ అవగాహన చేసుకున్నా. నీలో నీ ఆత్మలో చూడు ఎక్కడైనా త్యాగము, నిష్కల్మషత్వం ఉన్నవేమో, నాతల్లికొరకు కాస్త పంచిపెట్టు."

ఆవేశంతో, రోషంతో దూషిస్తూ బ్రతిమాలుతూ గుండెద్రవించేట్లు అన్న మామగారి మాటలు విన్న రఘు చలించాడు. నిజమే. కుంతల జీవించినన్నాళ్ళయినా నేను సరిగా చూడకపోతే నా భవిష్యత్తుకైనా ప్రమాదమే. ఆలో చించుకున్న రఘు కన్నీటితో ఆవేశంతో పట్టినశ్రమతో అతి విషాదమూర్తిలా ఉన్న మామగారివైపు చూసి వేదన నటిస్తూ,

"క్షమించండి. నాన్నగారి లెటరువలన అలా వెళ్ళ వలసివస్తోంది. మరల త్వరలో వచ్చేస్తాను. అక్కడకు వెళ్ళి వారికి కన్పించి వచ్చేస్తాను" అన్నాడు.

జయరామ్ శాంతించాడు. కాని కుంతల ఏమంటుందో నని భయంమాత్రం పోలేదు.

ఇదంతా విన్న శారదాంబ "కొండనుత్రవ్వి ఎలుకను పట్టుకున్నాము మనము. మనతల్లి జీవించిఉన్నా ఈ దుర్మా ర్గుడితో సుఖపడేదికాదు" రఘును నిందిస్తూ అంది

ఉషోదయ కిరణాలు కుంతలఉన్న 'ఎ'క్లాసు పాలరాయిని మరీ మరిపింపచేస్తున్నాయి. టాయిలెట్ అయివచ్చిన భర్తను చూస్తూ అప్పటివరకు పడిన బాధనంతా మరచిపోయింది కుంతల.

మార్ఫియా ఎక్కువ మోతాదుకూడ కుంతలకు బాధను నివారించుటలేదు. శరీరమంతా శిలతో కొట్టినట్లు గిల గిలకొట్టుకుంటూ ఉంది. డాక్టర్ ఫిలిప్ బాధగా నిట్టూరుస్తూ మత్తు ఇవ్వడంకంటే ఇంకేమీ చేయలేక అశక్తుడయ్యాడు. అయినా భర్తకొరకు తను ఎంత కష్టాన్నయినా సంతోషంతో

దిగమ్రింగాలనే ప్రయత్నిస్తోంది. వారు నావెంత కూర్చుంటే చాలు నాకింకేమి కావాలి. నాకు త్వరగా తగ్గిపోతుంది. ఇద్దరమూ ఢిల్లీ వెళ్ళిపోతాము. కష్టము రాకుండా ఉంటుందా? మల్లిక్ కు రాలేదూ! వారెంత బాధపడుతున్నారు. అక్కడ చదువు పాడైపోతోంది. మామగారు వెళ్ళి చదువుకోమని లెటరు వ్రాసినట్లు చెప్పారు. అయినా వెళ్ళరు, నాకు తెలుసు. తన ప్రియమైన లిల్లీని వదలి వెళ్ళలేరు. నాకూ కొద్దిసేపు కనిపించకపోతేనే ప్రాణం పోయేట్లుంటుంది. నేనెలా వదలి ఉండగలను! భగవాన్! దూరంచేయకు తండ్రీ! మా సంతోషాన్నంతా తీసుకున్నావు కనీసం నా కళ్ళముందుంచు తండ్రి నా ప్రియతముడను.

కళ్ళవెంట ప్రథమంగా నీరుకార్చిన కుంతలను చూస్తూనే తెల్లబోయాడు రఘు. "ఏమిటి లిల్లీ! ఏంపని?"

"ఏంలేదు రఘూజీ! మిమ్మలను సుఖపెట్టలేకపోయినా ఈ స్వార్థపరురాలు మీరు ఎదురుగా ఉంటేచాలని ప్రార్థించు కుంటోంది."

"అలా ఏడవకు లిల్లీ! త్వరగా తగ్గిపోతుంది."

వెడుతున్నానని చెప్పలేకపోయాడు భార్యముఖాన్ని పరిశీలించిన రఘు. తననే ప్రాణాన్నంతా కళ్ళల్లో పెట్టుకొని చూస్తూ తెల్లగా పాలిపోయి శల్యావస్థలోనున్న భార్యను చూచేసరికి రఘు ఒక్కసారి మరల దిగులుతో కృంగిపోయాడు. కాని వెళ్ళిపోవాలి...... విధి పరిహసించినట్లు ఆడకూడదు నేను. నేను తిరిగి నిలబడాలి. నాన్నగారు వ్రాసినట్లు, చనిపోవుటకు సిద్ధంగా ఉన్న ఈమెదగ్గర నేను పొందేదేమిటి?

శూన్యంమినహా ఇక్కడ ఏమీ లేదు. క్రూరంగా మారిపోయింది రఘు హృదయం. కుంతల కళ్ళుమూసుకొని బలహీనమైన చేతు లను భర్త మెడచుట్టూ వేసి నిశ్చింతగా ఉంది.

నెమ్మదిగా చేతులు తప్పించాడు. కుంతల లేవలేదు. అడుగులో అడుగు లేసుకుంటూ వెళ్ళిపోయాడు రఘు. జయ రామ్, శారదాంబ భయపడుతూ కుంతలదగ్గర కూర్చున్నారు.

కళ్ళు తెరుస్తూనే రఘుకొరకు చూచింది కుంతల. తన వైపే ఆదుర్దాగా చూస్తున్న తల్లి, తండ్రి మినహా రఘు జాడ లేదు.

"ఎక్కడికి వెళ్ళారు నాన్నా, డాక్టరు దగ్గరకా"

తప్పలేదు జయరామ్‌కు. ఆవేశాన్ని అణచిపెట్టు కుంటూ,

"ఢిల్లీ వెళ్ళాడమ్మా!"

"ఆ!"—వేయిపిడుగులు పడినట్లయింది కుంతలకు. ఇంక తను జీవించదు. వారుండుటవలన తన కింతవరకు శక్తి ఉంది...భారంగా కళ్ళుమూసుకుంది కుంతల.

తల్లడిల్లిపోయారు జయరామ్, శారదాంబ.

"నా తల్లికి ఎంత కష్టము వచ్చిందండీ! ఇల్లంతా కళకళ లాడుతూ తిరిగే నాతల్లి, అమ్మా అమ్మా అంటూ ఒక్కపనీ చేయనిచ్చేదికాదు. ఎన్ని జన్మలకైనా ఇలాంటిబిడ్డ నాకింక దొరుకుతుందా? భగవాన్! బిడ్డను రక్షించు తండ్రీ!" వెక్కి వెక్కి ఏడ్వసాగింది శారదాంబ.

జయరామ్‌కళ్ళు చెమర్చాయి. రఘుమీద మొదటి సారిగా కోపంవచ్చింది. తనులేకపోతే మందుతీసుకోదని తెలిసి

కూడ పాషాణంవలె నేలకురాచి వెళ్ళిపోయాడు. కోపంతో ముఖం కందిపోయింది. అయినా తమాయించుకున్నాడు.

కుంతల మరల కన్ను తెరవలేదు. గాబరాగా జయరామ్ డాక్టరును పిలచి జరిగినవిషయంచెప్పి ఆమర్దాచెందాడు. డాక్టర్ ఫిలిప్ ముక్కుమీద వ్రేలేసుకున్నాడు రఘుచేసిన పనికి.

కుంతల పిచ్చిమాటలు మాట్లాడుట ప్రారంభించింది. స్మృతి పూర్తిగా కోల్పోయింది. డాక్టర్ ఫిలిప్ వారంరోజుల్నుంచి చేయని ప్రయత్నంలేదు. ఆఖరిసారి ఆశాకిరణంగా జయరామ్‌తో,

"అది మైండ్‌కు వచ్చిందండి! అదృష్టంవలన ఇప్పటివరకు జీవించిఉంది. అయినా ఆమెభర్తకు టెలిగ్రాం ఇవ్వండి. ఫలితముండవచ్చు. నేనే యిస్తానులెండి" కన్నీరుమున్నీరుగా కార్చే జయరామ్‌నుచూసి జాలిచెందిన డాక్టర్ అన్నాడు.

శారదాంబ కేమీ తెలియకపోయినా, కాళ్ళు కదలించలేకపోయినా ఎన్నోకబుర్లు ఓపికున్నప్పుడు చెపుతూ తనకు ధైర్యం చెప్రుతూఉండే బిడ్డ స్మృతిలేనిస్థితిలో మాట్లాడుతూఉంటే వెక్కి వెక్కి ఏడుస్తూ సేవచేస్తూఉంది. నిద్రాహారాలు లేవు. ఆకలి, నిద్ర కుంతల మంచమెక్కిననాడే పోయాయి జయరామ్‌కు, శారదాంబకు. ఒకరికొకరు ధైర్యంచెప్పుకుంటూ ఒకోపర్యాయం ఇద్దరూ ధైర్యం కోల్పోయి వాపోతున్నారు.

టెలిగ్రాం అందుకున్నాడు రఘు. నిర్లిప్తంగా కుంతల దగ్గరకు వచ్చాడు. భర్తస్పర్శ, డీప్ఎక్సు రేకిరణాల మహాత్యం కుంతలను మరల ఈలోకంలోనికి తెచ్చాయి. వేయిగులాబీలు

వికసించినట్లు భర్తవైపు చూసింది కుంతల. కాని ఊపిరి సలుపుట లేదు. ఆక్సిజన్ సహాయంగా పెట్టారు. రోజురోజుకూ మార్పువస్తోంది. డాక్టర్ ఫిలిప్ నిరాశచెంది భగవానుని ఒకసారి తిట్టుకున్నాడు కసిగా.

ఆ రోజు సునీత, కుంతల మాట్లాడేసరికి ఎంతో సంతోషించింది. కుంతలతో స్నేహం, సునీతకు ఎంతో మధురంగా పండు వెన్నెలలా హృదయంలో ఆవరించింది. సునీతను చూస్తుంటే కుంతలకు మమతను చూసినట్లుంటోంది. ఇద్దరిమధ్యా స్నేహానికి మించిన బంధాలు ఏర్పడ్డాయి. కుంతలదగ్గరే ఎక్కువ గడుపుతోంది సునీత. బావ వెళ్లినందుకు సునీత ఎంతగానో బాధపడింది. ఒక్కమాటన్నా అక్కతో చెప్పాలని ఎదురుచూసింది. కాని స్మృతిలేని కుంతలస్థితి తారుమారగుట సునీతను ఆందోళన పరిచింది. బావ తిరిగివచ్చుట, కుంతల కళ్ళు తెరుచుట ఈరోజు పండుగగా ఉంది సునీతకు.

"చూడమ్మా! సునీత ఈ వారంనుండి ఇక్కడే ఉంది. వెళ్ళమ్మా అంటే వెళ్ళలేదు."

తల్లిమాటలకు కుంతలకు సునీతమీద మరింత వాత్సల్యం పెరిగింది.

"అక్కా- ఈ గులాబీలు నీకోరకు తెచ్చాను" అంటూ గులాబీలు అందించింది సునీత ప్రేమగా.

రఘు సునీతను వాత్సల్యంతో చూశాడు. యౌవ్వనం ఒక్కసారిగా ఉరుకుతుంది విచక్షణాజ్ఞానం లేకుండా. నవనీతంలా పాలమీగడలాంటి వన్నెలతో యౌవ్వనం పొంగే సునీత రఘు హృదయంలో క్రొత్త స్పూర్తిక కల్గించింది. పులకరించింది రఘు

హృదయంలో, నవవసంతం చిగురించినట్లనిపించింది. కాని భర్తను గమనించే స్థితిలో కుంతల లేదు. ఊపిరిపీల్చుటకు బాధ పడుతోంది. ఈ బాహ్యాలోకాలకు ఆవలగా చోటు చేసుకుంటోంది. భర్త ఉనికి మినహా కుంతలకేమీ కన్పించుటలేదు. తల్లి పిలచినా సమాధానంలేదు. తండ్రి ప్రేమతో పిలచే "అమ్మా!" అనే పిలుపు విన్నట్లు సూచనే లేదు. భర్త చేతిలో చేతినిమాత్రం తీయుటలేదు. సునీత అందించిన గులాబీలు తీసుకుంటూ కృతజ్ఞతగా చివరిసారిగా చూసి అవి భర్తచేతిలో ఉంచి ఎన్నడూ చూడని చూపు చూసింది. రఘు హృదయం గ్రహించింది. తల్లడిల్లిపోయింది. "లిల్లీ, లిల్లీ" అంటూ పిలువ సాగాడు.

ఎంత పిలచినా కొద్దిగా కళ్లు తెరచి చూచుట మినహా ఇంకేమీ లేదు. శారదాంబ, జయరామ్ బాహ్యాన్ని మరచి బిగ్గరగా ఏడ్చుట ప్రారంభించిరి. రఘు డాక్టరును తీసుకొని వచ్చాడు.

"ఇంక ఇంటికి తీసుకువెళ్ళుట మంచిది" తలవంచుకొని విషాదంగా వెళ్ళిపోయాడు డాక్టరు.

అందరూ ఓదారుస్తూ కారు మాట్లాడి ప్రయాణం చేయించారు. రఘు మేనత్త ఎంతో సహాయం చేసింది శారదాంబకు. సునీతను తీసుకొని శారదాంబకు తోడుగా తనూ బయలుదేరింది కారులో పాలెము.

దారిపొడుగునా ఎంత బాధపడాలో అంత బాధపడింది కుంతల అపస్మారకంలో. తరచుగా చేతులుమాత్రం ఎవరి

కొరకో వెతుకుతూ ఉన్నాయి. ఆ వెతికే చేతులు రోదించే తల్లికో, కఠినహృదయుడై కాలంకొరకు పరుగులెత్తే భర్త కొరకో ఆ భగవానునికే తెలియాలి.

ఇంటికి వచ్చింది కుంతల.

వీణానాదంతో మధురధ్వనులు నింపుతూ, అపర సరస్వతీదేవిలా సౌందర్యదీపికలు వెదజల్లి అందరి నేత్రాలకూ వెలుగులునింపిన ఇల్లు, కళకళలాడుతూ కుంతల లావణ్యా చేతులతో సేవ చేయించుకొని మురిసిన ఇల్లు ఈరోజు కుంతలను చూసి బావురుమన్నది. ఇల్లు, పాలెము గ్రుడ్డివారు, పసిపిల్లలు మినహా తతిమ్మా ప్రజలంతా కుంతలనుచూస్తూ గిలగిలలాడిపోయారు.

ముందుగానే లెటర్ వ్రాసినందువలన సమత, మల్లిక్ అక్కకొరకు ఎదురుచూస్తూ ఉన్నారు. అక్కను ఈ స్థితిలో చూడగానే బావురుమన్నారు.

"అక్కా ఒక్కసారి మాట్లాడవూ! అక్కా! నన్ను ఒక్కసారైనా కోపగించని అక్కవు నీవు! ఎందుకక్కా అంత కోపం! నేనెంత విసిగించినా నవ్వుతూ జాలిగా చూసే నీకు ఎందుకక్కా అంతకోపం నామీద. సమత నక్కా! చెల్లిని! ఒక్కసారి మాట్లాడక్కా" అంటూ అక్కమీద తలపెట్టుకొని గిలగిలకొట్టుకొంటూ ఏడుస్తున్న సమతను బలవంతంగా అక్కకు దూరంచేశారు ఎవరో కఠిన హృదయులు.

"అమ్మా! మాసయ్యను చేసుకోకపోయినా నీవు సుఖముగా ఉంటే చాలనుకున్నాను. ఒక్కసారన్నా నీ కాపురం

నీవు చేసుకొనుట చూడలేకపోయాయమ్మా ఈ పాపిష్టికళ్ళు" శీతారావమ్మ విలపించిపోతోంది.

"అమ్మా ! ఇంటికి వచ్చాము చూడు. ఇల్లు ఇల్లు అంటూ తపించావుకదమ్మా ! చూడమ్మా ఒక్కసారి ! నీకు తగ్గిపోయిందమ్మా ! లేతల్లీ ! త్వరగా లేస్తానమ్మా, ఢిల్లీ వెళ్ళి పోతానమ్మా అంటూ ఎన్నిపర్యాయాలు చెప్పావు తల్లీ ! లే తగ్గిపోయింది. కుంతలా లేచి తిరుగమ్మా ! ఆతోట చూడు ఎలా ఎండిపోయిందో. నీవు చూస్తే ఊరుకోవుతల్లీ ! తప్పక లేస్తావు. ఒక్కసారి చూడమ్మా ! ఇవిగోనమ్మా నీ సామాను. నీవు ప్రేమగా కొన్నసామాను. ఢిల్లీ వెడుదువుగాని లేతల్లీ! ఒక్కసారి చూడమ్మా నా కడుపునోతన్ని,"— శారదాంబ గుండె పగిలిపోయేట్లు ఏడుస్తోంది. శక్తినంతా కోల్పోయిన శారదాంబకూడ నీరసంగా వాలిపోయినందువలన స్పృహ లేకుండా కుంతలను కౌగలించుకొని పడిపోయింది. బంధువులు విడతీయుటకు ప్రయత్నించినా సాధ్యంకాలేదు.

సునీత, సునీతతల్లి అందరినీ ఓదార్చసాగారు ఏడుస్తూ.

కుంతల ఒకచేతిని తల్లిపైకి కదలించింది. రెండవచేతిని రఘు తీసుకొన్నాడు. నెమ్మదిగా భారంగా శ్వాస ఆడుతోంది. ఇంకా కొద్దినిముషాలే నాతల్లి జీవితం అనుకుంటూ కన్నీరు కలిపిన తులసిరసం తీసుకొని ఎన్నిజన్మలలోనైనా ఈ మానవ జన్మ ఎత్తకు తల్లీ ! నీ ఓర్పు, నీ సహనం చూసైనా భగవా నుడు కరుణించలేదు. అమ్మ, నాన్న ఎక్కడ బాధపడతారో ననుకొని బాధనంతా దిగమ్రింగి నవ్వుతూ పలుకరించేదానివి. నీలో ఏశక్తి ఉందమ్మా ! ఆధ్యాత్మిక వేత్తలయి ఎన్నో సాధ

సలుచేసినవారైనా మృత్యువుకు భయపడి తను బాధపడుతూ ఇతరులను బాధపెట్టి ఏడ్పించుతారు. తల్లీ ! నీవు స్మృతిలో ఉన్నన్నాళ్లు ఎవరూ కంటతడిపెట్టకుండా చేశావు ! నీ మంద హాసాన్ని తుడిచివేసుకోలేదు. డాక్టర్లే ఆశ్చర్యపోయేట్లు నీ గాధను సహించావు. తల్లీ ! ఇప్పుడు చెపుతున్నానమ్మా ! ఈ తండ్రి ముందే తెలుసుకున్నాడమ్మా, బంగారుగనివి దక్క వని. నాలో నేనే కృళ్ళిపోతున్నానమ్మా ! దక్కించుకొనుటకే మా ప్రాణాలను బలిఇవ్వాలనుకున్నా ఇవ్వలేకపోయామమ్మా ! శిథిలాలుగా మమ్మలను విడిచివెళ్ళిపోతున్నావా తల్లీ ! నాన్నా, ఇవిగో అమ్మ చేసిందంటూ ప్రతిదీ పెడుతూ నన్ను మురిపించే దెవరమ్మా ! ఈ తండ్రిని క్షమించమ్మా ! నీలోని బాధను, నీమృత్యువును తప్పించలేకపోయానమ్మా ! కనీసం నీవు కోరిన భర్తనుకూడ నీకు ఇవ్వలేకపోయానమ్మా !"— అనుకుంటూ కుమిలికుమిలి ఏడుస్తూ తులసిరసం ఇచ్చే తండ్రి పితృ ప్రేమామృతాన్ని రెండుగుటకలు వేసింది కుంతల.

"అక్కా ! నేను డాక్టరుని అక్కా ! నన్ను చూసి ఎంతో మురిసిపోతావనుకున్నాను. ఒక్కసారి చూడక్కా ! నీ కాశ్మీరుఘాటో పగిలినప్పుడే భయంకర మబ్బులేవో ఉన్నా యనుకున్నామక్కా ! నీవే తేలికగా త్రోసివేశావక్కా ! ఇప్పుడుకూడ ఈ మృత్యువును త్రోసిరా అక్కా ! ఒక్కసారి పలుకరించక్కా ! ఒక్కసారి" మల్లిక్ తల బ్రద్దలుకొట్టుకుంటు ఏడుస్తున్నాడు.

"కుంతలా ! నా ఏడుపేకొట్టిందా ! నీవు సుఖంగాఉంటే చూడలేకపోయాను. కుంతలా, తెలిసి నీకు ఏ పాపం చేయ

లేదు. నీమీద ప్రేమవలన అలా తిట్టాను. కాని అప్పటినుండి పశ్చాత్తాపంతో క్రుగ్గిపోతున్నాను. కుంతలా మౌనవయ్యాను, ఒక్కసారి మాట్లాడవూ !" ప్రసాద్ భయంకరంగా ఆవేదనతో విలపిస్తున్నాడు.

నెమ్మదిగా ప్రయాణిస్తున్నాను. మీరంతా బాధపడవద్దు. నాకే, నేను బాగానేఉన్నాను, అంటూ అంతిమక్షణం వరకు కావాలని తెచ్చుకున్న చిరునవ్వులు పాలిపోయినా, అందాలను విరజిమ్ముతూన్న పాలరాయి మృదుత్వంలా ఉన్న కుంతల ముఖంలో ఛాయగా కన్పిస్తున్నాయి.

కృష్ణయ్యా, కమలమ్మా, మంజరి అందరూ వచ్చారు. వినయవతి, సౌజన్యవతి కోడలయినందుకు సంతోషం కొంత కాలమైనా ఉంచకుండా పోతున్నావా అమ్మా - అంటూ కమలమ్మ కోడలిని నిమురుతూ ఏడుస్తోంది.

ఇలాంటిదే జరుగుతుందనే నేను వద్దన్నాను ఈ పెళ్ళి-అని తలపోసే ముఖంతో ఒకమూలగా కూర్చుని కొడుకును చూసి బాధపడుతున్నాడు కృష్ణయ్య.

"వదినా ! ఒక్కసారి పలుకరించవూ ! ఈ వదినలాంటి బంగారపువదిన నాకింకెక్కడుంటుంది" అంటూ వదినదగ్గర కూర్చుని ఏడుస్తోంది మంజరి.

రఘు కుంతల ముఖాన్ని పరిశీలిస్తూ కూర్చుండిపోయాడు. "రఘూజీ ! నేనూ ఢిల్లీ వస్తాను. మీ పాదాలు నలిగిపోతాయి స్లిప్పర్లు వేసుక్కోండి, మీరు అలా ఆలోచిస్తూవుంటే నాకు భయంవేస్తుంది రఘూజీ ! ఏదీ నవ్వండి" అంటూ తన దగ్గర అల్లరి చేస్తున్న కుంతలే కన్పిస్తోంది.

కాశ్మీరులో ఆ హిమాలయాల చల్లదనంలో యౌవ్వనపు వెచ్చదనంలో పులకరించిన ఆ దృశ్యాలన్నీ గుర్తుకువస్తున్నాయి. స్కేటింగ్ చేసే మంచుముద్దలలో తనవడిలో పడుకొని,

"రఘూజీ ! ఈ ప్రపంచంలో లేని అమర ప్రేమ కావాలి మనది. ఈ జన్మలో మనమిద్దరమూ ఎప్పుడూ ఏ సందర్భాన విడివడకూడదు" అన్నమాటలు తలపుకువచ్చాయి తనలోకి.

"ఊహలు తను నిర్మించుకున్న భవిష్యత్తు, తన క్రూర మనస్సు తెలిస్తే కుంతల ఇన్నిరోజులు జీవించేదికాదు. కుంతలా నేనిప్పుడు నీతోనే వస్తాను కుంతలా! నన్ను ఒంటరిచేస్తున్నావు, నాకేమిటో భయంగాఉంది." ఒక్కసారిగా బావురుమన్నాడు. కుంతల సంతృప్తిపడినట్లుగా భర్తచేతిలో చేతిని చివరిసారిగా కదిలించి సంతోషంతో వెళ్ళిపోయింది అమరుల లోకానికి.

ప్రశాంత ప్రకృతీరమణిలా అలంకరించుకొని, ముస్తాబయి, నవ్వులజడిలో చిరునవ్వులుచిందిస్తూ పయనమయి వెళ్ళింది మందగమనంతో కృష్ణానదీ తీరానికి కుంతల.

కుంతలను పంపించిన ఇల్లంతా బావురుమంది ఒక్కసారిగా. అల్పహృదయం నిండుహృదయంముందే విస్పష్టంగా గోచరిస్తుంది. రఘు కుంతలను పోగొట్టుకున్న వెంటనే తెలిసింది లీలగా తన అల్పహృదయంలోని కోరిక.

మొదటిసారిగా మృత్యుఛాయలు చూసిన సునీతకు ఏమీ తోయుటలేదు. శూన్యంగా కృష్ణానదివైపు చూస్తూ అక్క ఛాయ లేమైనా కన్పిస్తాయేమోనని చూస్తోంది. సమత, సునీత ఒకరినొకరు పలుకరించుకొనుటకుకూడ ధైర్యం చాలుట లేదు.

సునీత భారంగా చూస్తున్నదల్లా ఉలిక్కిపడింది. బావ డైరీ చూడకూడదనుకుంటూనే ఒక పేజీ తీసింది. అది చివరి పేజీ డైరీలో. ఒక్కసారిగా త్రుళ్ళిపడి అంతా అయోమయంగా తోచ పదిపర్యాయాలు చదువుకుంది. ఒక్కసారిగా "అక్కా" అంటూ బావురుమంది. దగ్గరేఉన్న సమత గబగబ చేతిలోని డైరీతీసి చదివి నిర్విణ్ణురాలయింది.

"సునీతను వివాహం చేసుకోమని నా లిల్లీ సందేశమిస్తూ గులాబీల నందించింది."

చదివింది బిగ్గరగా.

# 21

కృష్ణయ్య కోడలికారణంగా చెల్లిని పలుకరించి కొడుకుతో పాటు తీసుకువెళ్ళాడు. రఘు ఏకాంతంలోనికి సునీత ఒక్కతే రాగలిగింది. సునీత హృదయంలో సౌందర్యవంతు డైన బావస్ఫుర్శతో, అతి నిష్కల్మష ప్రేమమూర్తి అక్క సందేశంతో బావపై అనురాగం ఉదయించింది.

కాలం మనుష్యులను మారుస్తుందనేదికాక రఘు కాలాన్నే మార్చుటలో కృతార్థుడయ్యాడు.

కృష్ణయ్య చెల్లి సంపాదించిన మూడులక్షలు ఆధారంగా సునీతను కోడలుగా చేసుకోవాలనుకున్నాడు. ఫలితం రఘుహృదయంలో క్రొత్తవసంతం చిమ్మినట్లయింది. పరిస్థితుల ప్రాబల్యంతో సునీత బావహృదయంలో తలదాచుకొని అమర లోకాల్లో విహరించసాగింది. తన అపూర్వసంభాషణలతో, మృదుమధుర చిరులాస్యాలతో ఏ పురుషుడు కన్యను వశం చేసుకోలేడు !

పీడ లేక తల్లితో చేరింది మద్రాసు సునీత. తిరిగి మరల పాతజీవితమైనా క్రొత్తభావాలు. క్రొత్తపరిమళాలు చిమ్ముతూ పరధ్యానంలో మైమరస్తూ చదువుయందు శ్రద్ధ చూపక బావఉత్తరాలను చదువుటలో ఈలోకాన్నే మరచి పోయేది సునీత. మూడు నెలలు మూడురోజులుగా గడచి పోయినాయి.

ఆరోజు కాన్వెంటునుండి హుషారుగా వచ్చిన సునీతకు షాక్ కొట్టినట్లయింది. తల్లి ఏడుస్తూ ఉంది.

"ఏమిటమ్మా !"— భయంగా దిగులుగా అడిగింది.

"ఏముందమ్మా ! ఇందుకే నాకు ముందునుంచి అన్నయ్యంటే ఇష్టముండేది కాదు. నేను అనుమానించినట్లే చేశాడు. నాపేర ఉన్న ఆ స్తినంతా నీ పేర వ్రాసివేయాలట. వ్రాసినతరువాతే లగ్నాలుపెట్టుకుంటారట !"

సునీత హృదయం ఒక్కసారిగా అసహ్యంతో నిండిపోయింది. "ఇదంతా మామయ్య చేస్తున్నపని. బావ మంచివాడే. ఎప్పటికీ అలా చేయడు."

"ఎందుకమ్మా! ఇలాంటివారితో నీ బంగారంలాంటి జీవితాన్ని నాశనం చేయదలుచుకోలేదు."

"అమ్మా! ఏమిటి నీవన్నేది ?" బాధగా తల్లి ముఖం లోకి చూస్తూ అంది సునీత.

"అవును, మరచిపో అమ్మా! అన్నయ్యలో మార్పు రాకుండా పోతుందా అని ఇన్ని సంవత్సరాలూ కూడదనే అవివేకంతో మీ యిద్దరినీ వదలివేయుట జరిగింది. ఇప్పుడు మించిపోయిందిలేదు. నాతల్లి శారదాంబ ఇందుకే అంత బాధపడేది. నీకు తెలియదమ్మా! కడుపుచించుకుంటే కాళ్ళమీదపడుతుందని దిగమింగాను మేనల్లుడు, అన్న చేసిన పనులకు. ఇలాంటివారే గనుక కుంతల జీవించదని తెలిసిన తరువాతకూడ ఆ బిడ్డకొరకు కానీ ఖర్చుచేయకపోగా ఇవ్వవలసిన కట్నమడిగారట. రఘుకు మాత్రం ఇంగితజ్ఞానం ఉండవద్దూ ? బిడ్డని అలా వదలి వెళ్ళి పోతానని కూర్చున్నాడట. జయరామ్ కన్నబిడ్డ కన్నీళ్లు చూడలేక అల్లుడిని బ్రతిమలాడుకున్నాడట. ఏదమ్మా, ఇతనిలో మాత్ర మెక్కడుంది మనమనుకునే మంచి ? రేపు మనలనైనా ఇలా చేసేవారేగా !"

ఆవేశంతో అంటున్న తల్లివైపు నొసలుచిట్లించి సశితంగా చూసింది. అవును, తను మాత్రం బావ వెళ్ళినందుకు బాధపడలా ! తన ఉద్యోగం కొరకు వెళ్ళవలసివచ్చి వెళ్ళి ఉంటారు. బావను నిందించుటలో అర్థంలేదు. అంతా మామయ్యదే తప్పు. తల్లితో ఏకీభవించలేక, తనను అర్పించుకున్న బావను హృదయంలో పదిలంగా దాచుకుంటూ,

"అమ్మా! బావనే నేను వివాహం చేసుకునేది. నా జీవితం పుష్పింపచేసింది బావ. నన్ను అర్పణచేసింది అక్క. ఈ అనుబంధాలనుండి నేనెలా దూరమవనమ్మా! బావ మంచివా రమ్మా!"

దుఃఖాన్ని ఆపుకోలేక తల్లిఒడిలో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"ఏమోనమ్మా! కంటికి రెప్పవలె చూచుకున్నాను. భగవానుడు ఏంచేయ దలచుకున్నాడో"—బిడ్డతల నిమురుతూ భారంగా నిట్టూర్చింది జయమ్మ.

కన్యాహృదయం సుకుమార సుమం వంటిది. అర్పించిన హృదయాన్ని వెనుకకుతీసుకొనుట కన్యజీవితంలో ప్రళయమే అవుతుంది. అందువలననే స్థిరం చేసుకున్న నిర్ణయంతో సునీతకు రోజులు సంతోషంగానే గడచిపోతున్నాయి. కాని వెనుకటిలా బావలెటమ్సలో మధువునుచిలకరించే నవ్వులపువ్వులు లేవు. గంభీరంగా క్లుప్తంగా సాగిపోతున్నాయి. తన లేతహృదయంలో దోబూచులాడే చిన్నారి చిలిపిభావాలకు సమాధానమే లేదు. అయినా లక్ష్యపెట్టలేదు, యౌవ్వన పసిడిజల్లులలో.

తలవని తలంపుగా తన కన్నులకు పండుగచేస్తూ అకస్మాత్తుగా వచ్చాడు బావ. సునీత పులకరించిపోయింది మత్తుగా.

సునీత బావహృదయంలో ఏకాంతంగా తలదాచుకొని తన ఆవేదనంతా విప్పిచెప్పింది ముద్దుముద్దుగా. మానవుల విచిత్రమైన భావపరంపరలు ఆ ముగ్ధ కేమితెలుసు. వీరిద్దరినీ చూసిన చంద్రుడు విషాదంగా మబ్బులచాటుకు వెళ్ళాడు.

తనలోని నిగూఢరహస్యాలు, మాధుర్యాలు, గాంభీర్యం ఆ ముగ్ధకు గోచరించలేదని రఘు సంతృప్తిపడి, ఒక్కసారి తన హృదయాన్ని పదిలపరచుకొని,

"చూడు సునీతా! నీవు ఒకవేళ నన్ను పొందలేక పోయావనుకో, ఏం చేస్తావు?" అని ప్రశ్నించాడు.

అమాయకంగా నవ్వుతూ బావను తన మృదువైన చేతులతో స్పృశిస్తూ,

"ఏ! నాకేమిటి? హాయిగా అక్కతోపాటు వెళ్ళి పోతాను" అంది సునీత.

తృప్తిపడ్డాడు రఘు. తిరిగి తనలోని ఈ విశిష్టప్రతిభకు తనలో తానే మురిసిపోతున్నాడు. అవును, తనంటే ఎవరికీ ప్రేమలేదు? తన నీడపడితే చాలు, దాసులైపోయేవారు ఆడపిల్లలు కాలేజీలో. కుంతల తననెలా ప్రేమించింది. సునీతా ఇంతే. తనలో ఇంత ఆకర్షణఉంది, ఇలాంటి గొప్పధనాన్ని ఈ గర్వపోతు కెందుకివ్వాలి? వ్రాయరట ఆస్తి. అతిగర్వంగా మాట్లాడిందిట అత్తయ్య. సర్దుకొని సునీత అధరాలను తడుముతూ ముఖం ప్రక్కకు త్రిప్పుకొని,

"సునీతా! నేనొకటి అడుగుతాను ఇస్తావా!" అన్నాడు.

రఘు మాటల్లో ఉద్వేగాన్ని గ్రహించి సునీత భయకంపితమయింది.

"ఏమిటి బావా! నీవు కావాలంటే ఇవ్వనిదేముంది?"

"అయితే నేను వ్రాసిన ఉత్తరాలన్నీ నాకిప్పుడు తీసుకు వచ్చి ఇవ్వు"

"అదేమిటి బావా ! ఉత్తరాలెందుకు ?" అమాయకంగా అడిగింది సునీత. క్రూరంగా ముఖం త్రిప్పుకున్న రఘును చూడలేదు సునీత.

"నామీద నిజంగా నీకు ప్రేమఉందా ?"

"అదేమిటి బావా ! ఈ పిచ్చిమాటలు !" బావ హృదయంలో తలదాచుకొని అంది సునీత.

"ప్రేమకు నిదర్శనంగా ఈ పనిచేస్తేనే నాకు మనశ్శాంతి."

"ఓస్, దీనికీ అర్ధరాత్రి ఎందుకు బావా! రేపిస్తానులే!"

"కాదు సునీతా! మెల్లగా తీసుకువచ్చి నాకిచ్చివేయి. చూడు, నిజంగా నీకు ప్రేమఉంది నామీద" అంటూ కృత్రిమ ముద్దులు కురిపించాడు.

మైమరచిన సునీత బావెందుకడుగుతున్నారో అనుకుంటూ ప్రేమ, గౌరవాలతో పదిలంగా దాచుకున్న బావ లెటర్సన్నీ తెచ్చియిచ్చింది.

ఉషోదయంలోని ఎర్రదనాన్ని పంచుకొని తన ఇనుప నాడాలున్న బూట్లతో మృదువైన కన్నెగులాబీని నలిపివేసి పకపక నవ్వుకుంటూ తనవిజయాన్ని పొగుడుకుంటూ వెళ్ళిపోయాడు రఘు. త్వరలోనే వివాహముహూర్తం తెలియజేస్తానని సునీతతో చెప్పాడు.

ఎదురుచూస్తోంది సునీత. అప్పుడప్పుడు మానయ్య డబ్బుప్రలోభం భయపెట్టినా బావమంచితనంలో నమ్మకమున్న సునీత ధైర్యంగానే ఉంటోంది. తల్లి అధైర్యంగా, అన్నను

వారి వంశాన్ని తిట్టుకుంటూవుంటే సునీత బావను పొగుడు కుంటూ తల్లిని గెలిచేసేది.

కుసుమలతలు తమ సుకుమారత్వాన్ని తెలుసుకున్నప్పటికీ, కోపగించినపుడల్లా విదిలించికొట్టే చిరుగాలులతో గేరింతలుకొడుతాయి అమాయికంగా.

ఆరోజు సునీత ఊగిసలాడిపోయింది, ఆ తుఫానులాంటి వార్తవిని. కన్నీరుమున్నీరుగా విలపించింది. తిట్టుకుంది కాసేపు, ఛీ ! ఇలాంటి నీచుడుగనుకనే బంగారంలాంటి త్యాగమయి అక్కను వెంటనే మరచి, ప్రేమలోపడ్డాడు. ఇలాంటి దుర్మార్గుడని తెలిసిఉంటే ఈ రెండుచేతులతో నొక్కి హత్యచేసేదాన్ని... కాదు కాను. అక్క అంతగా ప్రేమించిన బావ... ఆ త్యాగమయి, ఆ నిర్మలమూర్తి, ఆ ప్రేమమయి సొత్తయినందుకు బ్రతికిపోయాడు. నీచుడు... అబ్బ ! ఎంత రంపపుకోతపెట్టాడు. ఈ శరీరాన్ని ఏం చెయ్యాలి ? ఆ నీచుడిస్పర్శతో పంకిలమయిపోయింది. ఈ శరీరంతో జీవించలేను— నిశ్చయించుకున్న సునీత ఆత్మహత్యకు పాల్పడబోయింది, రఘు రెండులక్షలకట్నంతో దొంగచాటుగా వివాహం చేసుకున్నట్లు తెలిసిన అమాయకురాలు సునీత. తల్లి కనిపెట్టిచూస్తూ కృళ్ళిపోతున్నందువలన తల్లికంటబడింది. తల్లడిల్లిపోయిన తల్లి వడిలో చంటిపిల్లలా ఏడ్చింది సునీత.

నెమ్మదిగా కోలుకుంది. కుంతలపై ప్రేమ ఇంకా వృద్ధి అయింది. కలలో కుంతల కన్పించి నీవు బాగా చదువుకొని డాక్టరవుతల్లీ ! అపుడే నీకు శాంతి లభిస్తుంది— చేసిన దీవెన అందుకుంది. సునీత పునీతురాలయి, తల్లిపాదాలకు నమస్క

రించి గడచినజీవితాన్ని మరచుటకు ప్రయత్నించింది. కృత కృత్యురాలై మల్లిక్, సమత చదివే కాలేజీలోనే డాక్టర్ చదివి పూర్తి చేసింది.

*  *  *

శారదాంబ, జయరామ్ ప్రతినిముషం కుంతలను గుర్తుకు తెచ్చి వుండును రేపే ఆ మేడలో ఉండలేకపోయారు. మల్లిక్, సమత మెడిసన్ చదువుతూంటే, హిమాలయాలకు వెళ్ళి ఆ గాయాన్ని మాన్పుకొనుటకు ప్రయత్నించారు. మానవుడు బహుశ ఈ ఆధ్యాత్మికచింతన లేకపోతే పిచ్చివాడై ప్రపంచానికి నిప్పుపెట్టి తనూ కాలిపోయి ఉండేవాడు. సహజ ఆధ్యాత్మికసాధనాపరుడు జయరామ్ శారదాంబను మిగతా బిడ్డలకొరకు బ్రతికించాలని, హిమాలయాలలో భక్తిపారవశ్య మైన అనుభూతులు నిండిన హృదయాలలో, వెలుగుతో నిండిన చిరునవ్వుల దొంతర కుంతలను అపురూపంగా హృద యంలో దాచుకొని తేరుకోవాలని ప్రయత్నించాడు.

# 22

ఎనిమిది సంవత్సరాలు తనకు ఏమీ తెలియదన్నట్లు కాలం గడచిపోయింది. విశాఖపట్నంలో సమత, మల్లిక్ డాక్టరుపట్టా తీసుకొని హైద్రాబాద్‌లో కుంతలా డిస్పెన్సరీ ప్రారంభంచేసి తలిదండ్రులను తీసుకువచ్చి వారిని ఆనందింప చేయాలని ప్రయత్నిస్తున్నారు. సునీత తరువాత పట్టాతీసుకొని ప్రభుత్వోద్యోగంలో చేరింది. మల్లిక్, సమత కావాలని హైద్రాబాద్ బదిలీ చేయించుకున్నారు.

రఘు ఇంకా కలవరిస్తూనే ఉన్నాడు. అందరూ అక్క ఎదురుగావచ్చి నిలబడిందా అన్నట్లు అనుభూతిచెందారు, అక్కను కలవరిస్తున్న బావను చూసి. మధ్యమధ్య సునీతను కలువరిస్తూ ఉన్నప్పుడల్లా, సమత, మల్లిక్‌లు జాలిగొలిపే చూపులతో సునీతను ఓదారుస్తున్నారు.

తుఫానులావచ్చి ఒక యువతి అధునాతన యువతిలాగా ఉంది. ఫారిన్ పద్ధతిలో అమర్చుకుంది జుట్టును. లిప్‌స్టిక్ వేసుకొని ముఖమంతా రంగులతో నింపుకొని మేకప్ చేసుకొంది. విలువైన చీరధరించి అతినాజూకుగా అవయవాలన్నీ కన్పించేట్లుగా పమిట జారవిడిచింది. వెంట మరో పురుషుడు విలాసంగా నవ్వుతూ కబుర్లు చెపుతున్నాడు రఘువైపు చూపిస్తూ. ఆ యువతి రఘువైపు చూస్తూ కసిగా నవ్వుతోంది.

సమత, సునీత, మల్లిక్ ఆశ్చర్యంగా చూస్తున్నారు, రఘుకు ఈమె ఏమవుతుందా అని.

"డాక్టర్ ! ఎలాఉంది ?"

తెలుసుకోవాలనే ఆదుర్దా ఉన్నా డాక్టర్‌గా హుందా తనంతోనే అన్నాడు మల్లిక్ ఆ యువతి ఎబ్బెట్టు వేషాలకు అసహ్యించుకొని,

"ప్రమాదంగా ఉంది"

"ఓ ! అయితే ఇక్కడ ఈ కంపులో ఉండాలా ! నేనుండలేను డియర్ !" అంటూ నాటక ఫక్కీలో ప్రక్కనున్న యువకుడిని క్రీగంట చూస్తూ డాక్టర్సుఉన్నారని సంకోచించ కుండా గారాముగా అంది.

"సంఘంకోరకైనా తప్పదుగా డార్లింగ్ చూడు, వాడి చేతిలో ఏదో ఉంది !"

చొరవగా రఘు చెంతకువచ్చి జేబులన్నీ వెతికి చేతిలో ఉన్న కుంతల ఫోటోను తీసుకుంది.

"ఇంత అందమయిన అమ్మాయి వీడిని ఎలా లవ్ చేసిందో డియర్ !"

"ఆరోజుల్లో అంటూఉండేవాడు, నీలాగా అందమైనది కుంతలని"— తన అందం అపూర్వమయినదన్నట్లుగా విరగ బడుతూ అంది.

ముదుగారిపోయి మోటుగా మేకప్ చేసుకున్న ముద్దు చెక్కిళ్ళు, ఎన్ని విలువైనభూషణాలు తగిలించినా అతివికృతంగా ఉన్న ఆ యువతిని పరిశీలనగా చూసి అక్కతో పోల్చి సందుకు రఘును మనసులోనే తిట్టుకున్నారు సమతా, మల్లిక్. సునీత కళ్ళప్పగించి చూస్తోంది. మల్లిక్ సలహాతో తన భార్య తను గుర్తించి నర్సును ఆజ్ఞాపించింది, వార్డులో జాయిన్ చేయమని.

"మాకు ఏ డిస్టర్బెన్సు లేకుండా చూడండి డాక్టర్! నేనుండలేను క్లీన్‌గా లేకపోతే. ఎవరో అనుకుంటున్నారా? నా మెడలో సూత్రంకట్టి, నాకు అమ్మకానికి వచ్చిన నా భర్త గారే! మూడులక్షలు విలువ."

తన తెలివికి తనే వికృతంగా నవ్వి వెంటవున్న యువకుడివైపు గర్వంగా చూసింది.

ఒక్కసారిగా సునీత హృదయం కటకటపడింది ఆవేశంతో. దుర్మార్గుడికి తగిన శిక్షపడిందన్నమాట. భగవంతుడు లేడూ శిక్షించటానికి! అనుకుంది.

ఈ అమ్మాయా అక్కస్థానంలో ఉంది? అబ్బ! అక్క ఎక్కడ? కసితీరా వడ్చిందన్నమాట! అందుకే ఏదో ఆవేశంతో, మనోవేదనతో కృళ్ళిపోతున్నాడు గనుకనే ఈ జబ్బు వచ్చింది.

నమత, మల్లిక్ కసిగా రఘువైపు ఒకక్షణం చూసి తరువాత జాలిచెందారు.

రఘును వార్డులో జాయిన్ చేసి సునీతకు బాధ్యతను గుర్తుచేసి ధైర్యంచెప్పి, వయ్యారంగా విలాసంగా వెంటనున్న యువకుడితో కబుర్లుచెపుతూ భర్తవైపు కన్నెత్తిచూడని ఆ విలాసయువతిని చూస్తూ, అమ్మ, నాన్నలకు చెప్పాలనుకుంటూ వచ్చివేశారు త్వరగా.

ఇదివిన్న జయరామ్ భగవానుని చిత్రమైన నాటికకు విస్తుపోయాడు ఒక్కసారి.

శారదాంబ నిర్లిప్తంగా,

"నాతల్లిని, బంగారంలాంటి సునీతను పెట్టినబాధలు ఎక్కడికిపోతాయి. ఈజన్మలోనే శిక్ష విధించాడు భగవానుడు" నవ్వులొలికిస్తూ ఇంకా తనదగ్గర తిరుగుతున్నట్లుండే కుంతలను తలచుకొని కన్నీరు తుడుచుకొంది శారదాంబ.

రఘు ఆ అపస్మారకంలో ఎన్నో కలవరించాడు. సునీత, సమత, మల్లిక్ అజ్ఞాతంగా వారి దాంపత్యాన్ని పోల్చుకోగలిగారు.

ఢిల్లీ రమ్మంటే రానని మొండికేసినట్లు, మనకింత ఆస్తి ఉంటె నీకు ఉద్యోగ మెందుకని భర్తను ఉద్యోగం మాన్పించినట్లు రఘు కలవరింతలవలన తెలుసుకున్నారు. ఆ యువతి పేరు శ్రీదేవి అని గ్రహించారు. ఈ నాలుగురోజులూ నౌకరుతో చేయించుతూ ఊహాలోకాల్లో ఆ యువకుడితో విహరించుతూ కాలం గడిపిన శ్రీదేవిని చూసి ప్రపంచాలో ఇలాంటి స్త్రీలున్నారా? అని ఆశ్చర్యపోయారు డాక్టర్ సమత, సునీత, మల్లిక్.

ఒకరోజు రఘు కళ్ళు తెరిచాడు. సునీతను గుర్తుపట్టాడు. "సునీతా!" అంటూ బాపురుమన్నాడు. మరల స్మృతి తప్పిపోయింది. సునీత ఎన్నో ప్రయత్నాలు చేసింది. కళ్ళు చెమర్చాయి.

పంచాయత్రీ — సమాప్తం :—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B180 |
| పుస్తకం పేరు | కుంతల |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 143 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 55-58 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Pravallika |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |